శ్రీమాన్ మణవాళ మహాముని శిష్యులు
శ్రీమాన్ ప్రతివాది భయంకర అణ్ణంగరాచార్యస్వామి -
రచించిన

# శ్రీ వేంకటేశ్వర సుప్రభాతం

## ప్రతిపదార్థ విశేషాలు

ప్రతిపదార్థం, విశ్లేషణ :
**డా॥ తాడేపల్లి పతంజలి**
స్వరకల్పన:
**శ్రీ మాధవపెద్ది సురేష్ చంద్ర**
గాయనీ గాయకులు:
**శ్రీమాన్ గరిమెళ్ళ బాలకృష్ణ ప్రసాద్,**
**శ్రీమతి బుల్లెమ్మ,**
**శ్రీమతి నిత్యసంతోషిణి,**
**శ్రీమతి శ్రీనిధి,**
**శ్రీ సాయిచరణ్**



**శాంతా-వసంతా ట్రస్టు**, హైదరాబాద్

# Sri Venkateshwara Suprabhatham

(Pratipadaartha visesaalu)

*Commentary :*
***Dr Tadepalli Patanjali***
Ph : 9866691587
email : patanjali1576@gmail.com

ద్వితీయ ముద్రణ : **05 మార్చి 2023**
ప్రతులు : 500

ముద్రణ : రెయిన్ బో ప్రింట్ ప్యాక్, హైదరాబాద్

వెల : అమూల్యం

ప్రచురణ :
**శాంతా – వసంతా ట్రస్ట్**
**ప్లాట్ నెం.16, 17, గ్రీన్ వాక్‌వేస్**
**రాజేంద్ర నగర్,**
**హైదరాబాద్–500 030**
**email : svcthyd@gmail.com**
**www.shanthavasanthatrust.org**

# వినా వేంకటేశం న నాథో న నాథః

తిరుమల క్షేత్రంతో సమానమైన క్షేత్రము, శ్రీ వేంకటేశ్వరునితో సమమైన దైవములేరన్నది ఆర్యోక్తి. తిరుమల క్షేత్రాన్ని దర్శించని వైష్ణవులుండరు. భారతీయులు, ముఖ్యంగా ఆంధ్రులు ఉండరు. ఇంత ప్రశస్తమైన పుణ్యక్షేత్రానికి మూలవిరాట్ శ్రీ వేంకటేశ్వర స్వామి.

ఇంచుమించు ప్రతి శైవ, వైష్ణవ మందిరాలలో సుప్రభాతం పాడే సంప్రదాయముంది. ఈ సుప్రభాత ఆలాపనతోనే దేవాలయంలో అనేక పూజలు, సేవలు, నిత్యకైంకర్యాలు ఆరంభమవుతాయి. సుప్రభాత గీతానికి అంత ప్రాశస్త్యముంది. శ్రీ వేంకటేశ్వర సుప్రభాతం మరింత ప్రాశస్త్యముపొందింది. దీనిని 14వ శతాబ్దంలో శ్రీమాన్ ప్రతివాది భయంకర అణ్ణంగరాచార్యస్వామి రచించినట్లుగా మనకు తెలుస్తున్నది.

ఈ సుప్రభాతం వింటున్నపుడు ఒక అనిర్వచనీయమైన ఆనందం, ఉద్విగ్నత కలుగుతాయి. అవి శ్రీ వేంకటేశ్వరుని పట్లవున్న భక్తి ప్రభావం వల్ల కావచ్చు. శ్లోకం వెంబడి శ్లోకం ఒక తూగులో, ఒక శైలిలో ప్రస్తారమవుతుంది. చరణానికి చరణానికి మధ్య ఊపిరి తీసుకోనివ్వని స్వల్ప వ్యవధి మాత్రమే వుంటుంది. ఇలాంటి అద్భుత సుప్రభాతాన్ని నాలాంటి ఎందరో కాసింత నిమ్మళంగా వినడానికి, ప్రతిచరణానికి మధ్య కొంత విరామం, ఆ విరామ సమయంలో ఆహ్లాదకరమైన వాద్యసంగీతంతో నింపిన సుప్రభాతాన్ని మరింత హృదయానికి హత్తుకునేట్లుగా చేయడానికి ఒక ప్రయత్నం చేసాము. ఈ ప్రక్రియ కారణంగా శ్లోకంలోని ప్రతిచరణం మననం చేయగలిగితే కంఠవశమవుతుంది. ధ్యానమార్గానికి సులువుతుందని నా నమ్మిక.

22 నిముషాల సుప్రభాత శ్లోకగీతాలను కాస్తంతా సమయం పెంచి, అటు స్పష్టతనూ ఇటు శ్రావ్యతనూ ఆ చరణాలకు అద్ది రాగరంజితం చేయాలని ప్రముఖ సంగీత దర్శకులు శ్రీ మాధవపెద్ది సురేష్‌చంద్ర గారిని అభ్యర్థించడం జరిగింది. వారి స్వరకల్పనలో 16 రాగాలలో సుమధుర గళాలతో అపర అన్నమయ్యగా పేరుపొందిన శ్రీమాన్ గరిమెళ్ళ బాలకృష్ణప్రసాద్ గారు, శ్రీమతి బుల్లెమ్మ, శ్రీమతి నిత్యసంతోషిణి, శ్రీమతి శ్రీనిధి, శ్రీ సాయిచరణ్ గార్లు ఆలపించారు. ఇది సర్వ భక్తజన సమ్మతవుతుందని నా విశ్వాసం.

సంస్కృత భూయిష్ఠమైన ప్రతిచరణం అందరికీ సంపూర్ణంగా అర్థంకాకపోవచ్చు. అర్థం తెలుసుకొని ఆ భావాన్ని గ్రహించి రాగయుక్తమైన ఈ సుప్రభాత గీతాలను వినగలిగితే మరింత శోభస్కరంగా, భక్తి భావసుందరంగా వుంటుందని భావించి మహామహోపాధ్యాయ బ్రహ్మశ్రీ డా॥ తాడేపల్లి పతంజలి గారిని ఆ శ్లోకాలకు కేవలం అనువాదమేకాక, వ్యాఖ్యానాన్ని జోడించమని ప్రార్థించడం జరిగింది. ఈ పుస్తకం చెంత వుంచుకొని సుమధురంగా గానం చేసిన సుప్రభాత గీతాలను విని అస్వాదించండి! తరించండి!!

ఈ బృహత్తర ప్రయత్నాన్ని సిద్ధింపచేసిన శ్రీమాన్ తాడేపల్లి పతంజలి గారికి, శ్రీ మాధవపెద్ది సురేష్ చంద్ర గారికి గాయనీ గాయకులు శ్రీమాన్ గరిమెళ్ళ బాలకృష్ణ ప్రసాద్, శ్రీమతి బుల్లెమ్మ, శ్రీమతి నిత్యసంతోషిణి, శ్రీమతి శ్రీనిధి, శ్రీ సాయిచరణ్ గార్లకు నా హృదయపూర్వక నమస్కారాలు.

ఈ సుప్రభాత వ్యాఖ్యాన సహిత చిరుపుస్తకాన్ని, సుప్రభాత గీతాలను ఆవిష్కరించి, మనందరికీ ఆశీ:పూర్వకంగా అందేజేసిన పూజ్యగురువులు శ్రీమాన్ చాగంటి కోటేశ్వరరావు గారికి ప్రణామాలతో...

**– వరప్రసాద్ రెడ్డి**

**ప్రచురణ కర్త**

# పతంజలి పదాంజలి

నా కన్నతల్లిదండ్రులు, ప్రత్యక్ష దైవాలు శ్రీ తాడేపల్లి పార్వతీశశాస్త్రి, సుశీలలకు మొదటగా చేమొగుపులు.



సుప్రభాతమంటే శుభసూచకమయిన ప్రాతఃకాలము, ప్రభాతిక పాఠ్య మంగళవాక్యము( వేకువ కాలానికి సంబంధించి పఠింపదగిన శుభకరమైన వాక్యాల సముదాయము) అని రెండు అర్థాలు.

శ్రీ వేంకటేశ్వర సుప్రభాతమంటే స్వామిని మేల్కొలుపుతూ వేకువ కాలంలో పాడే శుభకరమైన వాక్యాల సముదాయము.

స్వామివారికి జరిగే మొదటి సేవ సుప్రభాత సేవ అని మనందరికి తెలుసు.

**స్వామి నిద్రపోతాడా?**

ఆయనకు మేలుకొలుపులు అవసరమా?

ఇవి సామాన్యులకు వచ్చే ప్రశ్నలు.

దీనికి జవాబు అన్నమయ్య స్వామి ఇలా జవాబిచ్చాడు.

**భోగి శయనమును బుసకొట్టెడిని**
**యోగనిద్ర పాయును మేల్కొనవే**
**మిన్నక వేసాలు మాని మేలుకోవయ్యా**
**సన్నల నీ యోగనిద్ర చాలు మేలుకోవయ్యా(1-374)**
**మేదిని జీవులగావ మేలుకోవయ్యా**
**నీ దయే మాకెల్ల రక్ష నిద్ర మేలుకోవయ్యా(1-377)**

స్వామివారు తనకు చివరగా చేసే ఏకాంత సేవ తరువాత యోగ నిద్ర పోతారట. అందుకని ఆయనను మేల్కొల్పాలని అన్నమయ్య మాట.

స్వామివారిని ఎందుకు మేలుకొలపాలో, సుప్రభాతం ఎందుకు పాడాలో ఇలా అన్నమయ్య స్వామి మనకు చెప్పక చెప్పాడు.

అన్నమయ్య సారస్వతంలో సుమారుగా 30 కీర్తనలలో స్వామివారికి ఇలా మేలుకొలుపులతో పాటు, జీవులకు కూడా మేలుకొలుపుల కీర్తనల ప్రస్తావన ఉన్నది.వాటి గురించి వ్రాస్తే మరలా అదొక చిన్న గ్రంథమవుతుంది.



శ్రీవారికి నిర్వహించే సుప్రభాత సేవలో మొత్తం నాలుగు విభాగాలు ఉంటాయి. మొదటిది సుప్రభాతం, స్తోత్రం, ప్రపత్తి, మంగళాశాసనం. (మొత్తం శ్లోకాలు 70.) ఈ నాలుగింటిని కలిపి 'సుప్రభాతం' అను పేరు లోకంలో బాగా వ్యాప్తి చెందింది.

'కౌసల్యా సుప్రజా రామ' అంటూ ప్రారంభమయ్యే సుప్రభాతంలో మొత్తం 29 శ్లోకాలు ఉన్నాయి. శ్రీరాముని సంబోధనతో మొదలయ్యే సుప్రభాతం మోక్షం ఇప్పించమంటూ వేంకటేశ్వరునికి చేసే వినుతితో పూర్తవుతుంది. సుప్రభాతంలోని 'కౌసల్యా సుప్రజా రామ' అనే శ్లోకం రామాయణంలోనిది .

సుప్రభాత సేవలో రెండవదయిన స్తోత్రంలో 11 శ్లోకాలు ఉన్నాయి. శరణాగత తత్త్వం ఎక్కువగా ఈ శ్లోకాలలో కనబడుతుంది.

సుప్రభాత సేవలో మూడవదయిన ప్రపత్తిలో మొత్తం 16 శ్లోకాలు ఉన్నాయి. మొదటి శ్లోకం అమ్మవారికి సంబంధించినది. మిగిలిన 15 శ్లోకాలు శ్రీవారి స్తుతి. సుప్రభాత సేవలో చివరిదయిన మంగళాశాసనంలో 14 శ్లోకాలు ఉన్నాయి. స్వామివారికి, తద్వారా మనకి మంగళ ఆశీర్వాదాలు ఇందులో ఉన్నాయి.

ఈ సుప్రభాత శ్లోకాలు చాలా సుప్రసిద్ధాలు. చాలామంది భక్తిగా వింటున్నాం. అయితే ఈ వినే విషయంలో పెద్దలు, సహృదయులు, పద్మభూషణ్ శ్రీ వరప్రసాద్ రెడ్డిగారికి ఒక ఆలోచన వచ్చింది. కొంచెం

నెమ్మదిగా అందరికి అర్థమయ్యేటట్లుగా ఈ శ్లోకాలను పాడించాలని, ఆ సుప్రభాతపు సాంద్రబింబానికి ( సి.డికి) అనుబంధంగా , దోష రహితంగా సుప్రభాతంలోని ప్రతి పదానికి అర్థం ఇస్తూ ఒక పుస్తకాన్ని ముద్రించాలని ఆ మహనీయమైన ఆలోచన. నన్ను ఫోనులో ఈ విషయం గురించి అడిగారు. పుస్తకంగా రచించమని కోరారు.

'**శృంగారశీలునకు మంగళం** 'అను అన్నమయ్య కీర్తనలో '**మహనీయ ధృతికిని మంగళం**' అను ఒక మంచి మాట ఉన్నది. ధృతి అంటే ధరించబడునది. ధైర్యము, సంతోషము, యజ్ఞము, సుఖము, చిత్త స్థైర్యము అని ధృతిపదానికి అర్థాలు. ఈ 'ధృతిని' తన జీవన విధానంలో కలుపుకొన్న వరప్రసాదరెడ్డి గారు అడిగిన మంచి కార్యక్రమాన్ని కాదనటం ఎలా?

అందుకే వారి మాటను శిరసావహించి ఈ చిన్న పుస్తకాన్ని శ్రీ వేంకటేశుని అనుగ్రహంతో రచించాను. ఈ వేంకటేశ్వర సుప్రభాతంపై డా. వి.వి. వేంకటరమణగారు , బాలకృష్ణమూర్తి గారు ఇదివరలో రచించిన పుస్తకాలు ఈ రచనలో నాకు తోడ్పడ్డాయి. వారికి ధన్యవాదాలు . కేవల ప్రతి పదార్థమే కాకుండా, కొన్నిశ్లోకాలకు విశేషాలు కూడా వ్రాసాను. ఎక్కడా తప్పులేకుండా పుస్తకము ముద్రణ కావాలని తాపత్రయం. అంతా ఆ స్వామి దయ. పుస్తకాన్ని ముద్రిస్తున్న శ్రీ వరప్రసాద్ రెడ్డిగారిని, వారి కుటుంబ సభ్యులను అన్నమయ్య వేంకటేశుడు చల్లగా రక్షించాలని ప్రార్థిస్తున్నాను. ఈ సందర్భంలో నాకు తోడ్పడుతున్న నా శ్రీమతి మీనాక్షి, చిరంజీవినులు దీప్తి కావ్యలకు అక్షర పరిమళ శతములు అర్పిస్తున్నాను.



**ఏది చూచినా నీవే యిన్నియును మతి నీవే (1-60) నేనై విడువవద్దు / తానై తగులవద్దుతానే తానై వుంటేదగులెల్ల నూదు(4-414)చిత్తజగురుడ నీకు శ్రీమంగళం / నాచిత్తములో హరి నీకు శ్రీమంగళం(20-189)**

**డా. తాడేపల్లి పతంజలి**

9866691587

Patanjali1576@gmail.com

# విషయసూచిక

# 01. శ్రీ వేంకటేశ్వర సుప్రభాతం

**కౌసల్యా సుప్రజా రామ పూర్వా సంధ్యా ప్రవర్తతే!**
**ఉత్తిష్ఠ నరశార్దూల కర్తవ్యం దైవమాహ్నికమ్ 01**

**ప్రతి పదార్థము :**

కౌసల్యా సుప్రజా రామ = కౌసల్యాదేవి యొక్క చక్కటి సంతానమైన ఓ శ్రీ రామా !
పూర్వా సంధ్యా = తూర్పు దిక్కున సంధ్య
ప్రవర్తతే = కలుగుచున్నది(తూరుపు తెల్లవారుచున్నది)
నరశార్దూల = ఓ పురుషోత్తమా !
ఉత్తిష్ఠ = లెమ్ము.(మేలుకొనుము)
దైవం = దైవ సంబంధమైన
ఆహ్నికమ్ = పగటి వేళ చేయదగిన పూజ మొదలైన కార్యక్రమములు
కర్తవ్యం = చేయవలెను

**విశేషాలు**

కౌసల్యా సుప్రజా రామ అనకుండా “దశరథా సుప్రజా రామా” అనకూడదా? దీనికి పెద్దలు చేసిన వ్యాఖ్యానం ఇది .

1. పట్టమహిషి అయిన కౌసల్యకు పిల్లలు పుట్టకపోతే దశరథుడు సుమిత్రని వివాహం చేసుకున్నాడు. ఆమె ఇంటికి రాకుండా కైకమ్మ ఇంటియందు గడిపాడు, కైకకు పిల్లలు పుట్టకపోయినా, ఆవిడమాటే

దశరథుడు వినడం మొదలుపెట్టాడు. ఇన్ని చేసినా కౌసల్య నొచ్చుకోలేదు. మహా ప్రతివతయై, ఎప్పుడూ దశరథ మహారాజుని అనుసరించింది. అందుకే 'కౌసల్యా సుప్రజా రామ'

2. పిల్లలు పుట్టకపోతే కౌసల్య ఎప్పుడూ భగవంతున్ని నమ్ముకున్నది. భగవంతున్ని నిందించలేదు. అందుకే 'కౌసల్యా సుప్రజా రామ'

3. లేక లేక పుట్టిన శ్రీరాముని విశ్వామిత్రుడు తీసుకొని వెళుతున్నప్పుడు తిరస్కరించలేదు. అందుకే 'కౌసల్యా సుప్రజా రామ'

4. అన్ని లోకాలలో వ్యాపించిన విష్ణుతత్వాన్ని 12 నెలలు మోసింది. అందుకే 'కౌసల్యా సుప్రజా రామ'

**ఉత్తిష్ఠోత్తిష్ఠ గోవింద ఉత్తిష్ఠ గరుడధ్వజ**
**ఉత్తిష్ఠ కమలాకాన్త త్రైలోక్యం మంగళం కురు 02**

**ప్రతి పదార్థము :**

| | |
|---|---|
| గోవింద | = ఓ గోవిందుడా ! |
| ఉత్తిష్ఠ | = లెమ్ము(నిద్రనుండి లెమ్ము) |
| గరుడధ్వజ | = గరుడ పక్షి జెండాగా కలిగిన ఓ దేవా ! |
| ఉత్తిష్ఠ | = లెమ్ము |
| కమలాకాన్త | = లక్ష్మీదేవికి ఇష్టమైన ఓ వేంకటేశా ! |
| త్రైలోక్యం | = మూడు లోకములకు |
| మంగళం | = శుభమును |
| కురు | = చేయుము. |

**విశేషాలు :**

త్రి-లోకములు :

1. భూలోకము, 2. స్వర్గలోకము, 3. పాతాళ లోకము.

1. మనుష్య లోకము, 2. పితృలోకము, 3. దేవలోకము.

3/30/25, 7:18 PM PDF.js viewer



**మాతః సమస్త జగతాం మధుకైటభారేః**
**వక్షో విహారిణి మనోహర దివ్యమూర్తే**
**శ్రీస్వామిని శ్రితజనప్రియ దానశీలే**
**శ్రీ వేంకటేశ దయితే తవ సుప్రభాతమ్ 03**

**ప్రతి పదార్థము :**

| | |
|---|---|
| సమస్త జగతాం | = సమస్త లోకములకు |
| మాతః | = తల్లివియు; |
| మధుకైటభారేః | = మధువు, కైటభుడు అను రాక్షసులకు శత్రువైన విష్ణుమూర్తి యొక్క |
| వక్షో విహారిణి | = రొమ్మున విహరించుదానవును; |
| మనోహర దివ్యమూర్తే | = మనోహరము, దివ్యము అగు ఆకారము కలదానివియు; |
| శ్రీస్వామిని | = పూజ్యురాలవగు యజమానురాలవును; |
| శ్రితజనప్రియ దానశీలే | = శరణు కోరిన ప్రజల ప్రియములను అనగా కోరికలను ఇచ్చు స్వభావము కలదానవునుఅగు; |
| శ్రీ వేంకటేశ దయితే | = శ్రీ వేంకటేశ్వరుని ప్రియురాలవైన ఓ లక్ష్మీదేవీ! |
| తవ | = నీకు |
| సుప్రభాతమ్ | = శుభోదయము (అగుగాక !) |

**విశేషాలు :**

14 లోకములు

భూలోకము, భువర్లోకము, సువర్లోకము, మహాలోకము, జనలోకము, తపోలోకము, సత్యలోకము – ఈయేడును ఊర్ధ్వలోకములు.



https://shanthavasanthatrust.org/books/sri-venkateshwara-suprabhatham/ 12/82

3/30/25, 7:18 PM PDF.js viewer



అతలము, వితలము, సుతలము, రసాతలము, మహాతలము, తలాతలము, పాతాళము - ఈ యేడును అధోలోకములు

**తవ సుప్రభాత మరవిందలోచనే**
**భవతు ప్రసన్న ముఖచంద్రమండలే**
**విధిశంకరేన్ద్ర వనితాభిరర్చితే**
**వృషశైలనాథ దయితే దయానిధే. 04**

**ప్రతి పదార్థము :**

అరవిందలోచనే = పద్మముల వంటి కన్నులు కలదానా !
ప్రసన్న ముఖచంద్రమండలే = చంద్రబింబముతో సమానమైన ప్రసన్నమయిన మోము కలదానా !
విధిశంకరేన్ద్ర వనితాభిరర్చితే = బ్రహ్మ, శంకరుడు, ఇంద్రుడు - వీరల భార్యలగు సరస్వతి, పార్వతి, పులోమజ (శచీదేవి)లచే పూజింపబడుదానా !

వృషశైలనాథ దయితే = వృషభ పర్వత ప్రభువైన శ్రీవేంకటేశ్వరుని ప్రియురాలివయిన లక్ష్మీదేవీ !
దయానిధే = దయకు పెన్నిధియైనదానా !
తవ = నీకు
సుప్రభాతమ్ = శుభోదయము
భవతు = అగుగాక !

**విశేషాలు :**

**అరవిందము**



https://shanthavasanthatrust.org/books/sri-venkateshwara-suprabhatham/ 13/82

అరాకారాణి పత్రాణి విందతి – అరం = శీఘ్రం లిప్సాం విందతి వా– బండికంటియాకులవంటి రేకులుకలది (లేక) శీఘ్రముగా మక్కువ కలిగించునది. (తామర, పద్మము)

వృష అనగా ధర్మము. ఈ ధర్మమును చేయుటకు లక్ష్మీదేవి వృష శైల నాథునికి అవసరమని చెబుతూ, వృష **శైలనాథ దయితే** అని ఆమెను సార్థకంగా సంబోధించారు.

**అత్ర్యాదిసప్తఋషయస్సముపాస్య సంధ్యా**
**మాకాశ సింధు కమలాని మనోహరాణి**
**ఆదాయ పాదయుగ మర్చయితుం ప్రపన్నాః**
**శేషాద్రి శేఖర విభో తవ సుప్రభాతమ్ 05**

**ప్రతి పదార్థము :**

| | | |
|---|---|---|
| అత్ర్యాదిసప్తఋషయః | = | అత్రి మొదలయిన సప్త ఋషులు |
| సంధ్యాం | = | ప్రాతస్సంధ్యావందనమును |
| సముపాస్య | = | ఉపాసన చేసి అనగా సంధ్య వార్చి |
| మనోహరాణి | = | మనస్సును హరించునవైన |
| అకాశ సింధు కమలాని | = | ఆకాశగంగలోని పద్మములను |
| ఆదాయ | = | గ్రహించి |
| పాదయుగం | = | మీ రెండు పాదములను |
| అర్చయితుం | = | పూజించుటకు |
| ప్రపన్నాః | = | భక్తితో శరణము కోరి వేచి ఉన్నారు. |
| శేషాద్రి శేఖర విభో | = | శేషాద్రి శిఖరములో ఉన్న ఓ వేంకటేశ్వరా! |
| తవ | = | నీకు |
| సుప్రభాతమ్ | = | శుభోదయము |

3/30/25, 7:18 PM PDF.js viewer



**విశేషాలు :**

**సప్తర్షులు :** మరీచి, అంగిరసుడు, పులహుడు, వసిష్ఠుడు, అత్రి, పులస్త్యుడు, క్రతువు అనువారు సప్తర్షులు.
కశ్యపుడు, అత్రి, భరద్వాజుడు, విశ్వామిత్రుడు, గౌతముడు, జమదగ్ని, వసిష్ఠుడు అనువారు సప్తర్షులని కొందఱు చెబుతారు.

**పంచాననాబ్జభవ షణ్ముఖ వాసవాద్యాః**
**త్రైవిక్రమాది చరితం విబుధాః స్తువంతి**
**భాషాపతిః పఠతి వాసరశుద్ధిమారాత్**
**శేషాద్రి శేఖరవిభో తవ సుప్రభాతమ్ 06**

**ప్రతి పదార్థము :**

పంచాన నాబ్జభవ షణ్ముఖ
వాసవాద్యాః = మహేశ్వరుడు, బ్రహ్మ, కుమారస్వామి, మహేంద్రుడు మొదలగు వారైన
విబుధాః = దేవతలు;
త్రైవిక్రమాది చరితం = మీ త్రివిక్రమావతారాది సంబంధమైన చరిత్రను
స్తువంతి = స్తోత్రము చేయుచున్నారు.
భాషాపతిః = బృహస్పతి
వాసరశుద్ధిమ్ = తిథి వారాది నక్షత్ర యోగ కరణాది దిన శుద్ధిని
ఆరాత్ = దగ్గరనే
పఠతి = చదువుచున్నాడు.
శేషాద్రి శేఖరవిభో = ఓ శేషాద్రిని పాలించు ప్రభూ !
తవ = నీకు
సుప్రభాతమ్ = శుభోదయము



https://shanthavasanthatrust.org/books/sri-venkateshwara-suprabhatham/ 15/82

**విశేషాలు :**

**పంచాననుడు** = శివుడు (సద్యోజాతము, వామదేవము, అఘోరము, తత్పురుషము, ఈశానము అను ఐదు ముఖములున్నవాడు)

**షణ్ముఖుడు** = కుమారస్వామి. ఆఱు తలలు గలవాడు.

**వాసవుడు** = ఐశ్వర్యవంతుడు కనుక ఇంద్రునికి వాసవుడు అనిపేరు.

**త్రివిక్రముడు** = విష్ణువు. మూడులోకములను మూడడుగులుగా కొలచుట త్రివిక్రమ చరిత్ర.

**ఈషత్ప్రఫుల్ల సరసీరుహ నారికేళ**
**పూగద్రుమాది సుమనోహర పాలికానాం**
**ఆవాతి మందమనిల స్సహ దివ్యగంధైః**
**శేషాద్రి శేఖరవిభో తవ సుప్రభాతమ్ 07**

**ప్రతి పదార్థము :**

| | |
|---|---|
| ఈషత్ | =కొంచెముగా |
| ప్రఫుల్ల | = వికసించిన |
| సరసీరుహ | = తామరల యొక్కయు |
| నారికేళ | = కొబ్బరి |
| పూగ | = పోక (వక్క) మొదలైన |
| ద్రుమాది | = మొదలైన చెట్ల యొక్కయు |
| సుమనోహర | = బాగా మనోహరములైన |
| పాళికానాం | = మోవులయొక్కయు |

(లేత ఆకుల మొలకమొత్తము లేదా మొలకను మోవు అంటారు)

| | |
|---|---|
| దివ్యగంధైః సహ | = దివ్యమైన పరిమళములతో కలిసి |
| అనిలః | = వాయువు |

| | |
|---|---|
| మందం | = మెల్లగా |
| ఆవాతి | = వీచుచున్నది |
| శేషాద్రి శేఖరవిభో | = ఓశేషాచల పతీ ! |
| తవ | = నీకు |
| సుప్రభాతమ్ | = శుభోదయము |

**విశేషాలు :**

పోక = వక్క. (Areca catechu, the areca or betel-nut tree)

దీని భేదములు కారుపోక, తోటపోక మొదలగునవి.

శేషుడు స్వామివారి కోర్కెపై శేషాద్రిగా వెలిసాడు. ఆ కొండ మీద ప్రతి దేవత ఏదో ఒక రూపంలో కొలువై ఉన్నది. అందుకే ఆ పవిత్రతను గుర్తు చేయటానికి శేషాద్రి శేఖర విభో అని సంబోధన.

**ఉన్మీల్యనేత్ర యుగముత్తమ పంజరస్థాః**
**పాత్రావశిష్ట కదలీఫల పాయసాని**
**భుక్త్వా సలీలమథ కేళిశుకాః పఠంతి**
**శేషాద్రి శేఖరవిభో తవ సుప్రభాతమ్ 08**

**ప్రతిపదార్థము:**

| | |
|---|---|
| ఉత్తమ పంజరస్థాః | = శ్రేష్ఠములైన, గొప్పవైన పంజరములలో ఉన్న |
| కేళిశుకాః | =ఆటకొరకు పంజరపు గూటిలో ఉంచబడిన చిలుకలు(పెంపుడుచిలుకలు) |
| నేత్ర యుగమ్ | = రెండు కన్నులను |
| ఉన్మీల్య | = బాగుగా తెరిచి |
| పాత్రావశిష్ట కదలీఫల పాయసాని | = పాత్రయందు ఇదివరకు తినగా మిగిలిన అరటి పండ్లను, పాయసములను |
| భుక్త్వా | = తిని |

అథ = అటుపిమ్మట
సలీలమ్ = విలాసముగా
పఠంతి = పాడుచున్నవి
శేషాద్రి శేఖరవిభో = ఓశేషాచల పతీ !
తవ = నీకు
సుప్రభాతమ్ = శుభోదయము

**విశేషాలు :**

కేళిశుకాః (గూటిలో రామచిలుకలు) అను పదబంధము శరీరమను గూటిలో ఉండే జీవులకు కూడా ప్రతీక. శరీరపు పంజరాలలో ఉండే జీవులనే చిలుకలు కూడా స్వామివారిని ప్రాతః కాలంలో నుతించాలని హితోపదేశం.

**తంత్రీప్రకర్ష మధురస్వనయా విపంచ్యా**
**గాయన్త్యనంత చరితం తవ నారదోఽపి**
**భాషాసమగ్ర మసకృత్కర చారరమ్యం**
**శేషాద్రి శేఖరవిభో తవ సుప్రభాతమ్ 09**

**ప్రతిపదార్థము :**

నారదః+అపి = నారద మహర్షి కూడా
తంత్రీప్రకర్ష మధురస్వనయా = తంత్రులయొక్క పట్టుచే మధురమైన శబ్దము కలిగిన
విపంచ్యా = ఏడు తంతులు కలిగిన విపంచి అను వీణా వాయిద్యముతో
భాషాసమగ్ర మ్ = భాషచే సమగ్రమైన, లేదా భాషా మయమైన
అసకృత్కర చారరమ్యం = మాటిమాటికి చేతి ఆడింపులచే అందమయిన
తవ = నీయొక్క

అనంత చరితం = తుదిలేని చరిత్రను
గాయతి = గానము చేయుచున్నాడు.
శేషాద్రి శేఖరవిభో = ఓశేషాచల పతీ !
తవ = నీకు
సుప్రభాతమ్ = శుభోదయము

**భృంగావళీచ మకరంద రసానువిద్ధ**
**ఝుంకారగీత నినదైః సహ సేవనాయ**
**నిర్యాత్యుపాంత సరసీకమలోదరేభ్యః**
**శేషాద్రి శేఖరవిభో తవ సుప్రభాతమ్** **10**

**ప్రతి పదార్థము :**

భృంగావళీచ = తుమ్మెదల గుంపు కూడా
మకరంద రసానువిద్ధ = మకరందమను పూల తేనెను తాగుట వలన సంబంధించిన
ఝుంకారగీత నినదైః సహ = ఝుంకారమను గీతికా ధ్వనులతో
సేవనాయ = మిమ్ములను సేవించుటకు
ఉపాంత సరసీకమలోదరేభ్యః = సమీపములోని తటాకములలోని తామరపూల మధ్యనుండి
నిర్యాతి = బయటికి వచ్చుచున్నది
శేషాద్రి శేఖరవిభో = ఓశేషాచల పతీ !
తవ = నీకు
సుప్రభాతమ్ = శుభోదయము

**విశేషాలు :**

ఝుంకారగీత నినదైః

తేనెటీగలు సహజంగా చేసే ఝుంకారము ఓంకారానికి సమీపంగా ఉంటుంది. మానవులతో పాటు సకల ప్రకృతిలోని జీవరాశి స్వామి వారి సేవకు తహతహలాడుతున్నదని అద్భుత భావం.

**యోషాగణేన వరదధ్ని విమథ్యమానే**
**ఘోషాలయేషు దధిమంథన తీవ్ర ఘోషాః**
**రోషాత్కలిం విదధతే కకుభశ్చ కుంభాః**
**శేషాద్రి శేఖరవిభో తవ సుప్రభాతమ్ 11**

**ప్రతిపదార్థము :**

| | |
|---|---|
| ఘోషాలయేషు | = గొల్లవారి ఇండ్ల యందు |
| యోషాగణేన | = స్త్రీల సమూహము చేత |
| వరదధ్ని | = శ్రేష్ఠమయిన పెఱుగు |
| విమథ్యమానేసతి | = చిలుకబడినది అగుచుండగా |
| దధిమంథన తీవ్ర ఘోషాః | = పెఱుగు చిలుకుటవలన కలిగిన తీవ్రమయిన శబ్దము కలిగిన |
| కకుభః | = దిక్కులును |
| కుంభాఃచ | = పెఱుగు చిలుకు కుండలును |
| రోషాత్ | = రోషము వలన |
| కలిం | = కలహమును |
| విదధతే | = సలుపుచున్నవి.( అలా ఉన్నాయని భావము) |
| శేషాద్రి శేఖరవిభో | = ఓ శేషాద్రి పర్వతములో ఉన్న వేంకటేశ్వరా! |
| తవ | = నీకు |
| సుప్రభాతమ్ | = శుభోదయము |

**పద్మేశమిత్ర శతపత్ర గతాళివర్గాః**
**హర్తుం శ్రియం కువలయస్య నిజాంగలక్ష్మ్యా**
**భేరీనినాదమివ బిభ్రతి తీవ్రనాదం**
**శేషాద్రి శేఖరవిభో తవ సుప్రభాతమ్ 12**

**ప్రతిపదార్థము :**

పద్మేశమిత్ర శతపత్ర గతాళివర్గాః = కమలములకు ప్రభువగు సూర్యునకు మిత్రములైన తామరపూవులందున్న తుమ్మెదల సమూహములు
నిజాంగలక్ష్మ్యా = తమ శరీర కాంతి చేత
కువలయస్య = నల్లకలువ యొక్క
శ్రియం = కాంతిని
హర్తుం = అపహరించుటకు
భేరీనినాదమివ = భేరీనాదమును చేయువానివలె
తీవ్రనాదం = పెద్దధ్వనిని
బిభ్రతి = చేయుచున్నవి
శేషాద్రి శేఖరవిభో = ఓశేషాద్రి లో ఉన్న వేంకటేశ్వరా !
తవ = నీకు
సుప్రభాతమ్ = శుభోదయము

**విశేషాలు :**

ఒక రాజు ఇంకొక రాజు మీద దండయాత్ర చేయాలంటే భేరీ నాదాలు చేస్తాడు. తుమ్మెద అను ఒకరాజు నల్లని కలువ పూలు అను రాజుల నల్లని కాంతిని అపహరించాలనుకొని భేరీ నినాదం (ఝుంకారం) చేసింది. తుమ్మెద బాగా నల్లగా ఉన్నదని చెప్పటమే ఇక్కడ పరమార్థం. కాని దానిని అందంగా కవి ఆవిష్కరించారు.

**శ్రీమన్నభీష్టవరదాఖిల లోకబంధో**
**శ్రీ శ్రీనివాస జగదేక దయైకసింధో**
**శ్రీ దేవతాగృహభుజాంతర దివ్యమూర్తే**
**శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్ 13**

**ప్రతి పదార్థము :**

| | |
|---|---|
| శ్రీమన్ | = లక్ష్మీదేవితో కలిసి ఉండువాడా ! |
| అభీష్టవరద | = భక్తులు కోరిన వరములు ఇచ్చువాడా ! |
| అఖిల లోకబంధో | = అన్ని లోకాలకు బంధువైన వాడా ! |
| శ్రీ శ్రీనివాస | = పూజ్యురాలయిన లక్ష్మీదేవికి నివాస స్థలమైనవాడా ! |
| జగదేక దయైకసింధో | = ప్రపంచము మొత్తానికి ఒక్కడివే అయిన దయా సముద్రుడా ! |
| శ్రీ దేవతాగృహభుజాంతర దివ్యమూర్తే | = లక్ష్మీదేవికి నివాసమైన వక్షస్థలము చేత అందమయిన ఆకారము కలవాడా ! |
| శ్రీ వేంకటాచలపతే | = సంపదతో కూడిన వేంకటాచలపతీ ! |
| తవ | = నీకు |
| సుప్రభాతమ్ | = సుప్రభాతము అగుగాక ! |

**విశేషాలు :**

వేం పాపం నాశయతి- పాపమును నాశనము చేయువాడు. వేంకటేశ్వరుడు అని ఒక అర్థం.

వేం లోని వ అద్భుత శాశ్వతత్వాన్ని కలుగ చేసే బీజాక్షరం. కట అను రెండు అక్షరాలు ఐశ్వర్యానికి ప్రతీకలు. కనుక వేంకట అనగా శాశ్వతమైన ఐశ్వర్యమని ఇంకొక సమన్వయం.

3/30/25, 7:18 PM PDF.js viewer



**శ్రీ స్వామి పుష్కరిణికాఽప్లవనిర్మలాంగాః**
**శ్రేయోఽర్థినో హరవిరించి సనందనాద్యాః**
**ద్వారే వసంతి వరవేత్రహతోత్తమాంగాః**
**శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్ 14**

**ప్రతి పదార్థము :**

శ్రీ స్వామి పుష్కరిణికా
+ ఆప్లవనిర్మలాంగాః = శ్రీ స్వామి పుష్కరిణిలో మునుగుటచే నిర్మలమైన శరీరము కలిగినవారై
శ్రేయోర్థినః = మేలు కోరుకొనువారగుచు
హరవిరించి సనందనాద్యాః =శివ, బ్రహ్మ, సనందనాదులు
వరవేత్రహతోత్తమాంగాః = (ద్వారపాలకుల చేతులలోని) శ్రేష్ఠములైన పేముబెత్తములచే కొట్టబడిన తలలు కలవారగుచు (తలలపై బెత్తపు దెబ్బలు తినుచూ)
ద్వారే వసంతి = ద్వారమునందు వేచి ఉన్నారు.
శ్రీ వేంకటాచలపతే = సంపదతో కూడిన వేంకటాచలపతీ !
తవ = నీకు
సుప్రభాతమ్ = సుప్రభాతము అగుగాక !

**విశేషాలు :**

గరుత్మంతుడు పుష్కరిణిని వైకుంఠం నుంచి భూమికి తెచ్చాడు. "స్వామి పుష్కరిణీ స్నానం సద్గురోః పాదసేవనమ్ ఏకాదశీ వ్రతం చాపి త్రయ మత్యంత దుర్లభమ్""స్వామి పుష్కరిణీ స్నానం, సద్గురువుకు సేవచేయడం, ఏకాదశీవ్రతం చేయడం - ఈ మూడు ఎంతో దుర్లభమైనవి. ఈ మూడు పనులు చేసేవారు అదృష్టవంతులు.



https://shanthavasanthatrust.org/books/sri-venkateshwara-suprabhatham/ 23/82

శ్రీ శేషశైల గరుడాచల వేంకటాద్రి
నారాయణాద్రి వృషభాద్రి వృషాద్రి ముఖ్యాం
ఆఖ్యాం త్వదీయవసతే రనిశం వదంతి
శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్ 15

**ప్రతి పదార్థము :**

| | |
|---|---|
| త్వదీయవసతేః | = నువ్వుండే నివాసముకు |
| శ్రీ శేషశైల | = శేషాచలమని |
| గరుడాచల | = గరుడాచలమని |
| వేంకటాద్రి | = వేంకటాచలము లేక వేంకటాద్రి అని |
| నారాయణాద్రి | = నారాయణాద్రి అని |
| వృషభాద్రి | = వృషభాద్రి అని |
| వృషాద్రి | = వృషాద్రి అని |
| ముఖ్యాం | = మొదలుగా గల |
| ఆఖ్యాం | = పేర్లను |
| అనిశం | = ఎల్లప్పుడు |
| వదంతి | = చెప్పుచున్నారు. |
| శ్రీ వేంకటాచలపతే | = సంపదతో కూడిన వేంకటాచలపతీ ! |
| తవ | = నీకు |
| సుప్రభాతమ్ | = సుప్రభాతము అగుగాక ! |

సేవాపరాః శివసురేశ కృశానుధర్మ
రక్షోంబునాథ పవమాన ధనాధినాథాః
బద్ధాంజలి ప్రవిలసన్నిజశీర్ష దేశాః
శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్ 16

**ప్రతి పదార్థము :**

| | |
|---|---|
| శివః | = ఈశ్వరుడు |
| సురేశః | = దేవేంద్రుడు |
| కృశానుః | = అగ్ని |
| ధర్మః | = యమధర్మరాజు |
| రక్షః | = నైరుతి |
| అంబునాథః | = వరుణుడు |
| పవమానః | = వాయువు |
| ధనాధినాథాః | = కుబేరుడు మొదలగు అష్టదిక్పాలకులు |
| బద్ధాంజలి | = కూర్చబడిన కైమోడ్పులచే |
| ప్రవిలసన్నిజశీర్ష దేశాః | = ప్రకాశించు శిరో భాగములు కలవారై (తలలయందు చేతులుంచి నమస్కరిస్తున్నారని భావం) |
| సేవాపరాః | = నీ సేవ చేయుటకు ఆసక్తి కలిగి ఉన్నారు. |
| శ్రీ వేంకటాచలపతే | = సంపదతో కూడిన వేంకటాచలపతీ ! |
| తవ | = నీకు |
| సుప్రభాతమ్ | = సుప్రభాతము అగుగాక ! |

**ధాటీషు తే విహగరాజ మృగాధిరాజ**
**నాగాధిరాజ గజరాజ హయాధిరాజాః**
**స్వస్వాధికార మహిమాదిక మర్థయంతే**
**శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్ 17**

**ప్రతి పదార్థము :**

| | |
|---|---|
| తే | = నీయొక్క |
| ధాటీషు | = గమనములందు ( విహారములందు) |

3/30/25, 7:18 PM PDF.js viewer



విహగరాజ మృగాధిరాజ నాగాధిరాజ
గజరాజ హయాధిరాజాః = గరుడుడు, సింహము, ఆదిశేషుడు,
ఐరావతము. (ఇంద్రుని వాహనము.)
ఉచ్చైశ్శ్రవము ( గట్టిగా మాట్లాడినగాని వినలేని
చెవిటిదయిన ఇంద్రుని గుర్రము)అనునవి

| | |
|---|---|
| స్వస్వాధికార | = వారి వారి అధికారము, |
| మహిమాదికమ్ | = మహిమ మొదలయినవానిని |
| అర్థయంతే | = పొందుటకు నిన్నుప్రార్థించుచున్నారు. |
| శ్రీ వేంకటాచలపతే | = సంపదతో కూడిన వేంకటాచలపతీ ! |
| తవ | = నీకు |
| సుప్రభాతమ్ | = సుప్రభాతము అగుగాక ! |

**విశేషాలు :**

ఉచ్చైశ్శ్రవము అర్థాలు

1. ఇంద్రుని గుఱ్ఱము.
(ఆంధ్రశబ్దరత్నాకరము చెలమచెర్ల రంగాచార్యులు 1966)
2. నిక్కిన చెవులుగలది.
(ఆంధ్రశబ్దరత్నాకరము చెలమచెర్ల రంగాచార్యులు 1966)
3. గట్టిగా మాట్లాడినగాని వినలేనిది. చెవిటిది.
(ఆంధ్రశబ్దరత్నాకరము చెలమచెర్ల రంగాచార్యులు 1966)
4. ఉచ్చైః శ్రవసీ యస్య సః ఉచ్చైశ్రవాః
– ఉన్నతములైన చెవులు గలది.(అమరకోశము)
5. ఉచ్చైః శ్రవః కీర్తిః యస్య – ఉన్నతమైన కీర్తి కలది (అమరకోశము)



https://shanthavasanthatrust.org/books/sri-venkateshwara-suprabhatham/ 26/82

**సూర్యేందు భౌమబుధవాక్పతి కావ్యసౌరి**
**స్వర్భాను కేతుదివిషత్పరిషత్ప్రధానాః**
**త్వద్దాస దాస చరమావధిదాసదాసాః**
**శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్ 18**

**ప్రతి పదార్థము :**

సూర్యేందు = సూర్య+ఇందు = సూర్యుడు, చంద్రుడు
భౌమః = అంగారకుడు
బుధః = బుధుడు
వాక్పతిః = గురుడు
కావ్యః = శుక్రుడు
సౌరిః = శని
స్వర్భానుః = రాహువు
కేతుః = కేతువు
దివిషత్పరిషత్ప్రధానాః = అను దేవ సభలోని ప్రధానులు (నవగ్రహములు)
త్వద్దాస = నీ దాసులకు
దాస చరమావధిదాస దాసాః = దాసులలో చివరిలో ఉన్న దాసులకు దాసులై ఉన్నారు.
శ్రీ వేంకటాచలపతే = సంపదతో కూడిన వేంకటాచలపతీ !
తవ = నీకు
సుప్రభాతమ్ = సుప్రభాతము అగుగాక !

**విశేషాలు :**

శ్రీ వేంకటేశుని నమ్మిన వారిని గ్రహ ప్రభావాలు ఏమి చేయలేవని ఈ శ్లోక అంతరార్థం.

3/30/25, 7:18 PM PDF.js viewer



**త్వత్పాదధూళి భరిత స్ఫురితోత్తమాంగాః**
**స్వర్గాపవర్గనిరపేక్ష నిజాంతరంగాః**
**కల్పాగమాఽఽకలనయా ఽఽకులతాం లభంతే**
**శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్ 19**

**ప్రతి పదార్థము**

త్వత్పాదధూళి భరిత
స్ఫురితోత్తమాంగాః = నీ పాదధూళితో నిండి ప్రకాశించు తలలు కలిగినవారు (నీ పాద సేవకులయిన నీ భక్తులు)
స్వర్గాపవర్గనిరపేక్ష నిజాంతరంగాః = స్వర్గము, మోక్షములయందు కోరికలేని మనస్సు కలవారై
కల్పాగమాకలనయా = మరొక కల్పము వచ్చునను భావన చేత
ఆకులతాం లభంతే = వ్యాకులతను(దుఃఖమును) పొందుతున్నారు.
శ్రీ వేంకటాచలపతే = సంపదతో కూడిన వేంకటాచలపతీ !
తవ = నీకు
సుప్రభాతమ్ = సుప్రభాతము అగుగాక !

**విశేషాలు :**

కల్పం అంటే బ్రహ్మకు ఒక పగలు. ఇది 432 కోట్ల సంవత్సరాలు. ఒక కల్పంలో 14 మన్వంతరాలుంటాయి. మన్వంతరాన్నే మనుయుగమని కూడా అంటారు. మన్వంతరానికి 31,10,40,000 సంవత్సరాలు. ఒక్కో మన్వంతరంలో భూమిని ఒక్కో మనువు పాలిస్తాడు. ప్రస్తుతం నడుస్తున్నది ఏడవ మన్వంతరం. పాలిస్తున్నది వైవస్వత మనువు. దీన్ని వైవస్వత మన్వంతరం అంటారు. ఒక్కో మన్వంతరంలో 71 మహాయుగాలు, ఒక్కో మహాయుగంలో 4 యుగాలు (కృత, త్రేతా, ద్వాపర మరియు కలి యుగాలు) ఉంటాయి. (వికీపీడీయా సౌజన్యము)



https://shanthavasanthatrust.org/books/sri-venkateshwara-suprabhatham/ 28/82

ప్రస్తుతం నడుస్తున్నది శ్వేత వరాహ కల్పము. ఈ కల్పము తర్వాత ఈ కొండకు ఇంత మహిమ ఉండదని చెబుతారు. అందుకే ఈ శ్వేత వరాహ కల్పము పూర్తయిపోతుందేమో అని ఇప్పటినుంచే భక్తులు దుఃఖాన్ని పొందుతున్నారని కవి హృదయము.

**త్వద్గోపురాగ్రశిఖరాణి నిరీక్షమాణాః**
**స్వర్గాపవర్గ పదవీం పరమాం శ్రయంతః**
**మర్త్యా మనుష్యభువనే మతిమాశ్రయన్తే**
**శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్ 20**

**ప్రతి పదార్థము :**

| | |
|---|---|
| మర్త్యాః | = మనుష్యులు |
| పరమాం | = గొప్పదైన |
| స్వర్గాపవర్గ పదవీం | = స్వర్గ లోక, మోక్ష మార్గ ముసు |
| శ్రయంతః | = పొందుచున్నవారగుచు |
| త్వద్గోపురాగ్రశిఖరాణి | = నీదేవాలయ గోపురాగ్ర శిఖరములను |
| నిరీక్షమాణాః | = చూచుచున్నవారయి |
| మనుష్యభువనే | = మనుష్య లోకములో నివసించుటకు |
| మతిమ్ | = బుద్ధిని |
| ఆశ్రయన్తే | = పొందుచున్నారు. |
| శ్రీ వేంకటాచలపతే | = సంపదతో కూడిన వేంకటాచలపతీ ! |
| తవ | = నీకు |
| సుప్రభాతమ్ | = సుప్రభాతము అగుగాక ! |

3/30/25, 7:18 PM PDF.js viewer



**శ్రీ భూమినాయక దయాది గుణామృతాబ్ధే**
**దేవాధిదేవ జగదేక శరణ్యమూర్తే**
**శ్రీ మన్ననంత గరుడాదిభిరర్చితాంఘ్రే**
**శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్** **21**

**ప్రతి పదార్థము :**

| | |
|---|---|
| శ్రీ భూమినాయక | = శ్రీదేవికి , భూదేవికిని నాయకుడైనవాడా! |
| దయాది గుణామృతాబ్ధే | = దయ మొదలైన గుణములకు అమృత సముద్రము వంటివాడా ! |
| దేవాధిదేవ | = సర్వదేవతలను మించినవాడా ! (అధిరూఢాః దేవాః యేన బహువ్రీహి సమాసము) |
| జగదేక శరణ్యమూర్తే | = ప్రపంచములో నువ్వొక్కడవే శరణ్యుడివి. |
| శ్రీ మన్ | = సంపదతో కూడినవాడా! |
| అనంత గరుడాదిభిః | = ఆదిశేషుడు, గరుడుడు, విష్వక్సేనుడు మొదలయిన వారిచేత |
| అర్చితాంఘ్రే | = పూజింపబడిన పాదములు కలవాడా! |
| శ్రీ వేంకటాచలపతే | = సంపదతో కూడిన వేంకటాచలపతీ ! |
| తవ | = నీకు |
| సుప్రభాతమ్ | = సుప్రభాతము అగుగాక ! |

**శ్రీ పద్మనాభ పురుషోత్తమ వాసుదేవ**
**వైకుంఠ మాధవ జనార్దన చక్రపాణే**
**శ్రీవత్స చిహ్న శరణాగత పారిజాత**
**శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్** **22**



https://shanthavasanthatrust.org/books/sri-venkateshwara-suprabhatham/ 30/82

**ప్రతి పదార్థము :**

| | |
|---|---|
| శ్రీ పద్మనాభ పురుషోత్తమ | = ఓ పద్మనాభ! పురుషోత్తమ! |
| వాసుదేవ వైకుంఠ మాధవ | = వాసుదేవ ! వైకుంఠ !మాధవ! |
| జనార్దన చక్రపాణే | = జనార్దన !చక్రపాణీ! |
| శ్రీవత్స చిహ్న | = శ్రీ వత్సమను పుట్టుమచ్చకలవాడా! |
| శరణాగత పారిజాత | = శరణు అని వచ్చినవారికి పారిజాతమను కల్పవృక్షమువంటివాడా ! |
| శ్రీ వేంకటాచలపతే | = సంపదతో కూడిన వేంకటాచలపతీ ! |
| తవ | = నీకు |
| సుప్రభాతమ్ | = సుప్రభాతము అగుగాక ! |

**కందర్పదర్ప హరసుందర దివ్యమూర్తే**
**కాంతాకుచాంబురుహ కుట్మలలోలదృష్టే**
**కల్యాణనిర్మల గుణాకర దివ్యకీర్తే**
**శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్ 23**

**ప్రతిపదార్థము :**

| | |
|---|---|
| కందర్ప | = మన్మథుని |
| దర్ప | = దర్పమును |
| హర | = హరించు |
| సుందర | = అందమైన |
| దివ్యమూర్తే | = దివ్యమైన రూపము కలవాడా ! (మన్మథుని కంటే అందమైన ఆకారము కలవాడా !అని భావం) |
| కాంతా | = ప్రియురాలి |
| కుచాంబురుహ కుట్మల | = తామర మొగ్గలను పోలు స్తనములయందు |

| | |
|---|---|
| లోలదృష్టే | = ఆసక్తమైన దృష్టి కలవాడా ! |
| కల్యాణనిర్మల గుణాకర | = శుభకరమైన నిర్మలమైన గుణములకు స్థానమైన |
| దివ్యకీర్తే | = దివ్యమైన కీర్తి కలవాడా ! |
| శ్రీ వేంకటాచలపతే | = సంపదతో కూడిన వేంకటాచలపతీ ! |
| తవ | = నీకు |
| సుప్రభాతమ్ | = సుప్రభాతము అగుగాక ! |

**విశేషాలు :**

శంకర భగవత్పాదులవారు కనకధారాస్తవంలో **ముగ్ధా ముహుర్విదధతీ...** అంటూ అమ్మవారి చూపులను అయ్యవారి వైపు ప్రసరింప చేసారు. ఈ సుప్రభాత శ్లోకంలో అయ్యవారి చూపులు అమ్మ వారి వైపు ప్రసరిస్తున్నాయి.

**మీనాకృతే కమఠ కోల నృసింహ వర్ణిన్**
**స్వామిన్ పరశ్వథ తపోధన రామచంద్ర**
**శేషాంశరామ యదునందన కల్కిరూప**
**శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్ 24**

**ప్రతి పదార్థము :**

| | |
|---|---|
| మీనాకృతే | = చేప రూపము ధరించిన వాడా ! |
| కమఠ | = తాబేలు రూపము ధరించిన వాడా ! |
| కోల | = వరాహ రూపము ధరించిన వాడా ! |
| నృసింహ | = నరసింహ స్వామీ ! |
| వర్ణిన్ | = బ్రహ్మ చారి రూపమున త్రివిక్రమ రూపము ధరించినవాడా ! |

| | |
|---|---|
| స్వామిన్ | = ఓ వేంకటేశ్వర స్వామీ ! |
| పరశ్వథ తపోధన | = గొడ్డలి కలిగిన తాపసీ ! (ఓ పరశురామా!) |
| రామచంద్ర | = ఓ రామచంద్రా ! |
| శేషాంశరామ | = ఆది శేషుని అవతారమయిన ఓ బలరామా! |
| యదునందన | = శ్రీకృష్ణా ! (యయాతి సుతుడు యదువు. ఇతని వంశములో యాదవునికి కుమారునిగా జన్మించాడు కనుక కృష్ణుడు యదునందనుడు). |
| కల్కిరూప | = ఓ కల్క్యవతారా ! |
| శ్రీ వేంకటాచలపతే | = ఈ విధముగా దశావతారములు ధరించిన వేంకటేశుడా ! |
| తవ | = నీకు |
| సుప్రభాతమ్ | = సుప్రభాతము అగుగాక ! |

**ఏలాలవంగ ఘనసార సుగంధి తీర్థం**
**దివ్యం వియత్సరితిహేమఘటేషు పూర్ణం**
**ధృత్వాఽద్య వైదిక శిఖామణయః ప్రహృష్టాః**
**తిష్ఠంతి వేంకటపతే తవ సుప్రభాతమ్ 25**

**ప్రతి పదార్థము**

| | |
|---|---|
| వైదిక శిఖామణయః | = వేదవిదులైన బ్రాహ్మణ శ్రేష్ఠులు |
| ఏలాలవంగ ఘనసార సుగంధి | = ఏలకులు, లవంగములు, పచ్చకర్పూరము – వీటి చేత పరిమళ భరితమైన |
| దివ్యం | = మనోహరమైన |
| తీర్థం | = నీటిని |
| వియత్సరితి | = ఆకాశగంగనుండి |

హేమఘటేషు = బంగారు కుండలలో
పూర్ణం = నిండుగా
ధృత్వా = ధరించి
ప్రహృష్టాః = బాగా సంతోషించుచున్నవారై
అద్య = ఇప్పుడు
తిష్ఠంతి = నీకొరకు వేచి ఉన్నారు.
శ్రీ వేంకటాచలపతే = వేంకటేశుడా !
తవ = నీకు
సుప్రభాతమ్ = సుప్రభాతము అగుగాక !

**భాస్వానుదేతి వికచాని సరోరుహాణి**
**సంపూరయంతి నినదైః కకుభో విహంగాః**
**శ్రీ వైష్ణవాః సతత మర్థిత మంగళాస్తే**
**ధామాశ్రయంతి తవ వేంకటసుప్రభాతమ్ 26**

**ప్రతి పదార్థము :**

భాస్వాన్ = సూర్య దేవుడు
ఉదేతి = ఉదయించుచున్నాడు
సరోరుహాణి = కమలములు
వికచాని = వికసించినవి
విహంగాః = పక్షులు
నినదైః = శబ్దములచే
కకుభః = దిక్కులను
సంపూరయంతి = నింపుచున్నవి
శ్రీ వైష్ణవాః = శ్రీ వైష్ణవులు
సతతమ్ = ఎప్పుడును

3/30/25, 7:18 PM PDF.js viewer



| | |
|---|---|
| అర్థిత మంగళాః | = ప్రార్థించుచున్న శుభాలు కలవారై |
| తే | = నీయొక్క |
| ధామ | = దివ్య సన్నిధిని |
| ఆశ్రయంతి | = ఆశ్రయించుచున్నారు. |
| శ్రీ వేంకటాచలపతే | = వేంకటేశుడా ! |
| తవ | = నీకు |
| సుప్రభాతమ్ | = సుప్రభాతము అగుగాక ! |

**బ్రహ్మాదయస్సురవరాస్స మహర్షయస్తే**
**సంతస్సనందన ముఖాస్త్వథ యోగివర్యాః**
**ధామాంతికే తవ హి మంగళవస్తు హస్తాః**
**శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్ 27**

**ప్రతి పదార్థము :**

| | |
|---|---|
| తే | = ప్రసిద్ధి పొందిన |
| బ్రహ్మాదయః | = బ్రహ్మ మొదలయిన |
| స్సురవరాః | = దేవతలలో శ్రేష్ఠులు |
| సమహర్షయః | = మహర్షులతో కూడినవారును |
| అథ | = మఱియు |
| సంతః | = సత్పురుషులగు |
| సనందన ముఖాః | = సనందనుడు మొదలగు |
| యోగివర్యాః | = యోగి వర్యులు |
| తవ | = నీయొక్క |
| ధామాంతికే | = ఆలయ సమీపములో |
| మంగళవస్తు హస్తాః హి | = శుభకరములైన పూజకు తగిన వస్తువులు చేతులలో పెట్టుకొని ఉన్నారు కదా ! |



https://shanthavasanthatrust.org/books/sri-venkateshwara-suprabhatham/ 35/82

3/30/25, 7:18 PM PDF.js viewer



| | | |
|---|---|---|
| శ్రీ వేంకటాచలపతే | = | వేంకటేశుడా ! |
| తవ | = | నీకు |
| సుప్రభాతమ్ | = | సుప్రభాతము అగుగాక ! |

**లక్ష్మీనివాస నిరవద్యగుణైక సింధో**
**సంసారసాగర సముత్తరణైక సేతో**
**వేదాంతవేద్య నిజవైభవ భక్త భోగ్య**
**శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్ 28**

**ప్రతి పదార్థము :**

| | | |
|---|---|---|
| లక్ష్మీనివాస | = | లక్ష్మీదేవికి నివాసమైనవాడా ! |
| నిరవద్య | = | దోషములులేని |
| గుణైక సింధో | = | శుభ గుణాలకు ముఖ్య సముద్రము వంటివాడా! |
| సంసారసాగర | = | సంసారమను సముద్రమునకు |
| సముత్తరణ | = | దాటుటకు |
| ఏక సేతో | = | ముఖ్యమైన వంతెనవంటివాడా ! |
| వేదాంతవేద్య | = | ఉపనిషత్తులచే తెలుసుకోదగిన |
| నిజవైభవ | = | నిజవైభవము కలవాడా ! |
| భక్త భోగ్య | = | భక్తులచే అనుభవింపబడువాడా! (భక్తహృదయములందు తన దర్శనముచే అనందానుభవమును కలిగించువాడని తాత్పర్యము) |
| శ్రీ వేంకటాచలపతే | = | వేంకటేశుడా ! |
| తవ | = | నీకు |
| సుప్రభాతమ్ | = | సుప్రభాతము అగుగాక ! |



https://shanthavasanthatrust.org/books/sri-venkateshwara-suprabhatham/ 36/82

**ఇత్థం వృషాచలపతే రిహ సుప్రభాతమ్**
**యే మానవాః ప్రతిదినం పఠితుం ప్రవృత్తాః**
**తేషాం ప్రభాతసమయే స్మృతిరంగ భాజాం**
**ప్రజ్ఞాం పరార్థసులభాం పరమాం ప్రసూతే 29**

**ప్రతి పదార్థం**

| | |
|---|---|
| ఇత్థం | = ఈవిధముగా |
| వృషాచలపతేః | = వేంకటాచల పతికి |
| ఇహ | = ఈ ప్రాతః కాలములో |
| సుప్రభాతమ్ | = సుప్రభాత స్తోత్రమును |
| యే మానవాః | = ఏ మనుజులు |
| ప్రతిదినం | = ప్రతి రోజు |
| పఠితుం | = చదువుటకు |
| ప్రవృత్తాః | = ప్రవృత్తులగుచున్నారో |
| తేషాం | = ఆపాఠకులగు |
| అంగ భాజాం | = దేహులకు అనగా భక్తులకు |
| స్మృతిః | = ఈ వేంకటేశుని స్మరణము |
| పరార్థసులభాం | = పరమార్థమును ఇచ్చు |
| పరమాం | = శ్రేష్ఠమగు |
| ప్రజ్ఞాం | = ప్రజ్ఞను(పరమార్థ జ్ఞానమును) |
| ప్రభాతసమయే | = ప్రాతః కాలములో |
| ప్రసూతే | = కలుగజేయుచున్నది. |



# 02. శ్రీ వేంకటేశ స్తోత్రం

**కమలాకుచ చూచుక కుంకుమతో**
**నియతారుణి తాతుల నీలతనో**
**కమలాయత లోచన లోకపతే**
**విజయీభవ వేంకట శైలపతే 01**

**ప్రతి పదార్థము :**

| | |
|---|---|
| కమలా | = లక్ష్మీదేవి యొక్క |
| కుచ | = చన్నుల |
| చూచుక | = మొనల పై ఉన్న |
| కుంకుమతః | = కుంకుమ పూవు రంగు వలన |
| నియత | = నియమముగా, (నిత్యముగా) |
| అరుణిత | = ఎఱుపురంగు గలదిగా జేయబడిన |
| అతుల నీలతనో | = సాటిలేని నల్లని రంగు కలిగిన శరీరము కలవాడా ! |
| కమలాయత లోచన | = కమలములోని మెత్తందనాన్ని , అందాన్ని గుర్తుకు తెస్తూ చెవులవరకు వ్యాపించిన విశాలమైన కన్నులు కలవాడా ! |
| లోకపతే | = లోకానికి ప్రభువా ! |
| వేంకట శైలపతే | = వేంకట పర్వతానికి ప్రభువా ! |
| విజయీభవ | = నీకు విజయము కలుగు గాక! |

**విశేషాలు:**

**1. వ్యుత్పత్తులు**

కమలా = కమలము చేతియందు కలిగినది కాబట్టి అమ్మకి లక్ష్మీదేవికి కమలా అని పేరు.

కుచ = నాయకుని గోళ్లచే గిచ్చబడునది

(కుచ్యతే కామినా నఖైః కుచౌ).

చూచుక = బాలుని చేత పానము చేయబడుచూ చూచూ అని పలుకబడునది కనుక చను మొనకు చూచుకము అని పేరు వచ్చింది.

కుంకుమమ్= ఎండినప్పుడు కుమ్మని పలుకునది కుంకుమము .

**2. తోటక వృత్తము**

ఈ శ్లోకము తోటక వృత్తములో ఉంది.

తోటక వృత్తము. వినడానికి చాలా బాగుంటుంది.

పాదానికి 12 అక్షరాలు. నాలుగు స-గణాలు.

సంస్కృతంలో దీనికి యతి లేదు.

తెలుగులో తొమ్మిదవ అక్షరము యతి.

ఆది శంకరుల శిష్యులలో తోటకుడు మొదట చదువు రాని వాడు. తరువాత గురువు గారి దయతో

**"విదితాఖిల శాస్త్ర సుధా జలధే/మహితోపనిషత్ కథితార్థ నిధే**

**హృదయే కలయే విమలం చరణం/భవ శంకర దేశిక మే శరణం"**

(అన్ని శాస్త్రముల అమృత సముద్రమును తెలిసికొన్నవాడా ! ఉపనిషత్తులు చెప్పే అర్థమునకు నిధి లాంటి వాడా! నీ నిర్మలములైన పాదాలను నా హృదయము చూస్తోంది., శంకరాచార్యులే నా జీవితానికి శరణం) అని తోటక వృత్తములో గానం చేస్తూ తన జీవితంలో మార్పును సాధించాడు.

మార్పుకు కారణమైన తోటక వృత్తములో "కమలాకుచ చూచుక కుంకుమతో" శ్లోకం ఉంది. ఇది మొట్ట మొదట మనం గమనించాలి. భక్తితో ఈ స్తోత్రము చదివినవారి జీవితములో కూడా మార్పు వస్తుంది.

**3. గుడ్డుపై ఉన్న పెంకు**

దేవుళ్లకు సంబంధించిన పూర్వకాలపు శృంగార సాహిత్యము కోడిగుడ్డుపై ఉన్న పెంకులాంటిది. గట్టిగానే తగులుతుంది.

అబ్బా ! ఇక్కడ కూడానా... దేవుడి భక్తి దగ్గర కూడా శృంగారమేనా... అనిపిస్తుంది.

తల్లి పొదిగిన తర్వాత ఆ పెంకు పగిలి నూతనావిష్కరణము బయటికి వస్తుంది.

అలాగే గురువు చెప్పిన తర్వాత అందులోని అంతరార్థం తెలుస్తుంది.

ఈ స్తోత్రము దాటిన తర్వాత వచ్చే ప్రపత్తిలో 'మాతుస్తనా వివశిశోరమృతాయ మానౌ"అని ఒక పాదం వస్తుంది.

"బిడ్డకు మొట్ట మొదటి సారిగా తెలిసే అమ్మ చన్నుల వలె అమృత సమానములుగా ఉన్న నీ పాదములను నా శరణు పొందుతున్నాను" అని ఈ పాదానికి అర్థం.

ఇక్కడ కూడా స్తనముల ప్రసక్తి వచ్చింది కదా ! ఇది కూడ శృంగారమే అని భావించే వారికి నమో నమః

ఈ పంక్తిలో పాదాలను స్తనాలతో పోల్చాడు కవి.

అమ్మ చన్ను – ఆస్వాదిస్తున్న బిడ్డకు అమృత జీవితాన్ని అనుగ్రహిస్తుంది.

స్వామి పాదం – ఆ పాదాలను మానసంలో తలిచి తలిచి పరవశించే భక్తుని హృదయాన్ని ఆనందంతో నింపి అతని జీవితాన్ని అమృతమయం చేస్తుంది.

ఈ అర్థ వాతావరణంలోనే "కమలాకుచ చూచుక" అంతరార్థం తెలుసుకోవాలి.

**4. ఇది కామాన్ని మోక్షం వైపు మళ్లించే వర్ణన.**

సృష్టిలో అత్యంత ప్రాధాన్యం కలిగిన రంగు ఎరుపు.

సూర్యుడి వస్త్రాలు, రథం, ధ్వజం, పతాకం అన్నీ ఎరుపురంగువే.

ధైర్యానికి, చెడును పోగొట్టే శక్తికి, ప్రేరణాభావనకు, దృఢమైన నిర్ణయాత్మక వైఖరికి ఈ ఎరుపు రంగు ప్రతీక.

కాషాయము ఎరుపు నుంచి ఏర్పడినదే .

కాషాయ రంగు పవిత్ర జీవనానికి గుర్తు... కాషాయం, భగవంతునితో బంధానికి త్యాగాలకు గుర్తు.

ఇటువంటి కాషాయ జనని అయిన ఎరుపు రంగు ఈ శ్లోకంలో నలుపు రంగుతో కలుస్తోంది.

కాల తత్త్వానికి నల్లని కాళీమాత సూచన.

అలాగే నల్లని వేంకటేశుడు కూడా.

దృశ్య ప్రపంచాన్ని సృష్టించి, సృష్టికర్తగా నిలిచి, కల్పాంత సమయంలో, ఈ సర్వ ప్రపంచాన్ని తనలో లీనము చేసుకొనే దైవశక్తి వేంకటేశునిగా మన మాంస నేత్రాలకు నలుపురంగులో కనబడుతున్నాడు.

మనకు స్తోత్రంలో ఇబ్బంది ఎక్కడ వస్తోందంటే వేంకటేశుని, అమ్మ లక్ష్మీదేవిని మనలా చూడటం వల్ల. మానవీకరణం చేయటం వల్ల.

అవయవ దృష్టిని దాటి అంతరాత్మ దృష్టికి ప్రయాణం చేయాలి.

ఎరుపు, నలుపుతో కలిసి ఎరుపుగా మారిందంటే – ధైర్యాన్ని, చెడును పోగొట్టే శక్తిని, ప్రేరణాభావనను, దృఢమైన మోక్ష సాధన గల నిర్ణయాత్మక వైఖరిని పెంచుకోమనే సందేశం ఇందులో ఉంది.

**5. జగన్మాత వాత్సల్యము**

“నీ స్తన్య పానం చేస్తున్న వినాయకుడు నీ వక్షోజాలను చూసి ,తన ఏనుగు శిరస్సు అక్కడికి వచ్చిందేమోనని అనుమానంతో, తన ఏనుగు శిరస్సును, తన తొండంతో తడిమి చూసుకొంటున్నాడు. వినాయకుని సందేహానికి మీరిద్దరూ (పార్వతీ పరమేశ్వరులు) నవ్వుకుంటున్నారు. నీస్తనాలను గణపతి, కుమారస్వామి, ఇద్దరు ఒకే సారి పానం చేస్తున్నారు.

3/30/25, 7:18 PM PDF.js viewer



పుత్రవాత్సల్యము జాలు వారుతున్న ఆ స్తనద్వయం, మా దుఖాన్ని పోగొట్టు గాక." అని శంకర భగవత్పాదులు సౌందర్య లహరిలో అన్నారు. (సమందేవీ) ఇక్కడ స్తన వర్ణన జగన్మాత వాత్సల్యానికి ప్రతీక.

మన చూపు ఇలా ఉంటే ప్రాచీన సాహిత్యంలో దైవ వర్ణనలలోని శృంగార వర్ణనలకు ఇబ్బంది పడం.

**6. శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారు**

శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామి వారు యాదగిరి లక్ష్మీనరసింహ స్వామికి సంబంధించిన, కమలాకుచ చూచుక... పంథాలో సాగిన శ్లోకాన్నిఇలా వ్యాఖ్యానించారు.

"కమలాకుచ కస్తూరి కర్దమాంకిత వక్షసే యాదవాద్రి నివాసాయ సంపత్ పుత్రాది మంగళమ్" అని మంగళం పాడుతుంటే ఆయనని ఏమని వర్ణిస్తున్నాం? అమ్మ తన వక్షస్థలానికి కుంకుమ పాత్రములను రచించుకున్నది. ఆయన ఆలింగితుడై దేహమంతా పూసుకున్నాడు. ఓహో! అలాంటి స్వామీ నీకు మంగళం. ఏమిటండీ ఈ వర్ణన అనిపిస్తుంది. ఇదంతా తప్పు అని అనేవారు కొందరున్నారు. కానీ ఈ వర్ణనలు చెప్పేది జగత్ కారణమైన పరమాత్మను మరియు జగన్మాత అయిన అమ్మను. వారిరువురి శృంగారమే లేకపోతే నీకు జన్మ అనేది ఉందా! లోకంలో అమ్మ అందానికి నాన్న వశమైనప్పుడే కదా నీకు ఒక జన్మ అనేది లభించింది, కర్మ భారం తొలగించుకోవడానికి ఒక అవకాశం ఏర్పడింది. అలాంటి అందాన్ని స్మరించని బ్రతుకూ ఒక బ్రతుకేనా! అయితే ఆ అమ్మ అందం నీవు ఉపాసించదగినది కానీ అనుభవించదగినది కాదు. ఆ అందం నీకు జీవితాన్ని ఇచ్చేది – ఉపజీవ్యం అంటారు. నాన్నకు అదే అందం భోగ్యం. నీకు ఉండాల్సిన జ్ఞానం ఇది. ఇప్పుడు ఈ జ్ఞానంతో ఆ సౌందర్యాన్ని దర్శించు. అప్పుడు తప్పులేదు. ఉపనిషత్తులు ఈ విషయాన్ని మనకు తెలిపాయి,"



https://shanthavasanthatrust.org/books/sri-venkateshwara-suprabhatham/ 42/82

3/30/25, 7:18 PM PDF.js viewer



**6. సమూల ఋగ్వేద సంహిత (తితిదే వారి ప్రచురణ)**

కళా ప్రపూర్ణ డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య గారు ఈ శ్లోకానికి ఈ రకమైన ప్రతిపదార్థం ఇచ్చారు.

కమల = పద్మములయొక్క

ఆకుచ = బీజ కోశముల మీద వున్న – అనగా – దుద్దుల పైన వున్న,

చూచుక = కింజల్కములమీదకల,

కుంకుమతః = ఎఱ్ఱని పుప్పొడిరజమువల్ల,

నియత = ఎల్లప్పుడూ,

అరుణిత = ఎఱ్ఱగా చేయబడిన,

అతుల = సాటి లేని,

నీలతనో = నీలిమ వర్ణంలో వున్న శరీరం కలవాడా ! అని అసలైన అర్థం. అంటే – "నీలిమవర్ణంతోవున్న సాటిలేని నీశరీరం అపాదమస్తకమూ నియత పూజలో ఉపయోగింపబడే అరుణవర్ణ పద్మ కింజల్కాల పుప్పొడితో యెఱ్ఱగా వుంటుం"దని తాత్పర్యం. సాంప్రదాయ సిద్ధంగా గతానుగతికంగా చెప్పుకొంటున్న "శ్రీదేవియొక్క చనుమొనల యందలి కుంకుమ పూవు రంగువలన" అన్న అర్థంలో బొత్తిగా ఔచిత్యం లేదు. చను మొనల మీది కుంకుమ, ముఖం – వక్షస్థలం – హస్తతలాదుల మీద అంటుకొనడానికి అవకాశం వున్నదిగాని పాదాలు – ఊరువులు– ఉదరంవంటి వాటిమీదా, మిగిలిన శరీరమంతటా అంటుకొనే అవకాశంలేదు. అందువల్ల యీ గతానుగతికార్థంలో సార్థకతగాని ఔచిత్యంకాని అణుమాత్రమైనా లేదు.

ఇవన్నీ చదివిన తరువాత "కమలా....." శ్లోకంలో భక్తికి పెద్ద పీట వేద్దాం.





https://shanthavasanthatrust.org/books/sri-venkateshwara-suprabhatham/ 43/82

"చీకటి అంటే ఏమిటమ్మా?"

"ఏమీ కనిపించక పోవటం చీకటి."

"అయితే, నాకు ఏమీ కనిపించట్లేదు చూడు" కిట్టమూర్తి కళ్ళు మూసుకొని చెప్పాడు. నవ్వుతున్న అమ్మ యశోదమ్మ బాలకృష్ణునికి ఆడుకోవటానికి అనుమతి ఇచ్చింది.

❖ ❖ ❖

ఆ నల్లనయ్య చిరు దరహాసాలు ఆయన శృంగార వర్ణనలలో మనకు ఎప్పుడూ జ్ఞానోదయం కలిగించు గాక!స్వస్తి.

❖ ❖ ❖

**స చతుర్ముఖ షణ్ముఖ పంచముఖ**
**ప్రముఖాఖిలదైవత మౌళిమణే**
**శరణాగత వత్సల సారనిధే**
**పరిపాలయ మాం వృషశైల పతే. 02**

**ప్రతి పదార్థము :**

| | |
|---|---|
| స చతుర్ముఖ | = బ్రహ్మతో కలిసిన |
| షణ్ముఖ | = కుమారస్వామి |
| పంచముఖ | = మహేశ్వరుడు |
| ప్రముఖాఖిల | = ప్రముఖ+అఖిల |
| | = మొదలయిన ప్రముఖులయిన సమస్త |
| దైవత | = దేవతలకు |
| మౌళిమణే | = తలమానికమైనవాడా! |
| శరణాగత వత్సల | = శరణు చొచ్చిన వారియందు వాత్సల్యము కలిగినవాడా ! |
| సారనిధే | = బలమునకు నిధి వంటివాడా! |

| | |
|---|---|
| వృషశైల పతే | = ఓ వృషభాచల నాథుడా ! |
| మాం | = నన్ను |
| పరిపాలయ | = రక్షింపుము. కాపాడుము. |

**అతి వేలతయా తవ దుర్విషహై**
**రనువేలకృతై రపరాధ శతైః**
**భరితం త్వరితం వృషశైల పతే**
**పరయా కృపయా పరిపాహి హరే.** **03**

**ప్రతి పదార్థము :**

| | |
|---|---|
| హరే | = ఓ శ్రీ హరీ! |
| వృషశైల పతే | = సప్తగిరుల్లో ఒకటయిన ధర్మగిరికి అధిపతీ! (శేషాద్రి, నీలాద్రి, గరుడాద్రి, అంజనాద్రి, వృషభాద్రి, నారాయణాద్రి, వేంకటాద్రి. సప్తగిరులు) |
| అతి వేలతయా | = హద్దును మించునట్లు (వేల అనగా హద్దు, ఒడ్డు. దానిని దాటుట) |
| తవ | = నీకు |
| దుర్విషహైః | = సహింపలేని |
| అనువేలకృతైః | = ఎప్పుడూ ఆచరించిన |
| అపరాధ శతైః | = అనేక నేరములచేత |
| భరితం | = పూర్ణుడైనటువంటి |
| త్వరితం | = త్వరతో కూడినటువంటి |
| పరయా | = ఉత్కృష్టమయిన |
| కృపయా | = దయచేత |
| పరిపాహి | = నన్ను రక్షింపుము. |

3/30/25, 7:18 PM PDF.js viewer



**విశేషాలు :**

వృషాద్రి.

ధర్మదేవత ఈ కొండ మీద తపస్సు చేయడం వల్ల దీనికి వృషాద్రి, వృష శైలము అనే పేరు వచ్చింది. యమధర్మరాజు ఈ కొండపైన తపస్సు చేయడంవల్ల కూడా వృషాద్రి అనే పేరు వచ్చిందని చెబుతారు.

**అధి వేంకటశైల ముదారమతే**
**ర్జన తాభిమ తాధిక దాన రతాత్**
**పర దేవతయా గదితా న్నిగమైః**
**కమలా దయితా న్న పరం కలయే. 04**

**ప్రతి పదార్థము :**

| | |
|---|---|
| అధి వేంకటశైలమ్ | = వేంకటాచలమందు |
| ఉదారమతేః | = ఉదారమైన, దాన బుద్ధి కలిగినటువంటి |
| జనత | = ప్రజా సమూహము యొక్క |
| అభిమత | = కోరికలను |
| అధిక దాన | = అధికముగా ఇచ్చుటయందు |
| రతాత్ | = ఆసక్తి కలిగిన వాడగు |
| నిగమైః | = వేదములచేత |
| పర దేవతయా | = శ్రేష్ఠుడయిన దైవముగా |
| గదితాత్ | = పేర్కొనబడినటువంటి |
| కమలా దయితాత్ | = శ్రీ పతి అయిన వేంకటేశునికంటె |
| పరం | = ఇతరమును |
| న కలయే | = కొలుచుటలేదు(ఎరుగను) |



https://shanthavasanthatrust.org/books/sri-venkateshwara-suprabhatham/ 46/82

3/30/25, 7:18 PM PDF.js viewer



**విశేషాలు :**

**వేంకటాద్రి సమం స్థానం బ్రహ్మాండే నాస్తి కించన**
**వేంకటేశ సమో దేవో న భూతో న భవిష్యతి**

(వేంకటాద్రికి మించిన స్థానం ఈ బ్రహ్మాండంలో లేదు. వేంకటేశుని మించిన దైవం భూతభవిష్యత్ కాలాల్లో లేదు. అనుప్రసిద్ధోక్తి పై స్తోత్ర శ్లోకానికి సన్నిహితమైనది)

**కలవేణు రవా వశ గోపవధూ**
**శతకోటి వృతా త్స్మరకోటి సమాత్**
**ప్రతివల్లవికాభిమతా త్సుఖదాత్**
**వసుదేవసుతాన్న పరం కలయే. 05**

**ప్రతి పదార్థము :**

| | |
|---|---|
| కల | = మనోహరమైన |
| వేణురవావశ | = వేణు నాదముచే పరవశలయిన |
| గోపవధూశతకోటి | = గోపికా సహస్రములచే |
| వృతాత్ | = చుట్టుకొనబడినవాడు |
| స్మరకోటి సమాత్ | = కోటి మన్మథులతో సమానమైన వాడు |
| ప్రతివల్లవికాభిమతాత్ | = ఒక్కొక్కగోపికా స్త్రీకి ప్రియుడై |
| సుఖదాత్ | = సుఖమును ఇచ్చువాడగు |
| వసుదేవసుతాత్ | = వసుదేవపుత్రుడైన శ్రీ కృష్ణునికంటె |
| పరం | = ఇంకొకటి |
| న కలయే | = ఎరుగను |

**విశేషాలు :**

కృష్ణుడికి పదహారువేలమంది గోపికలతో కేవలం అల్లరి చేసాడు,



https://shanthavasanthatrust.org/books/sri-venkateshwara-suprabhatham/ 47/82

3/30/25, 7:18 PM PDF.js viewer



అల్లరి పెట్టాడు. అంతవరకే. హద్దు దాటలేదుకృష్ణుడు భోగిగా కనిపించే యోగి.

నెమలి పించం తలపై ఉండి శ్రీ కృష్ణుని పవిత్రతను తెలియజేస్తుంది. పదహారు వేల మంది గోపికలు ఉన్నా కూడా శ్రీ కృష్ణుడు అత్యంత పవిత్రుడు. అందుకే నెమలి పరవశించినపుడు మగనెమలి అశ్రు ధారను ఆడ నెమలి మింగితే అది పునరుత్పత్తిని పొందగలదట. అంతేకాని అవి సంభోగించవు. అందుకే కృష్ణుడు తలపై నెమలీక ధరిస్తాడు.

పిల్లన గోవిని గోవిందుని పెదవుల వద్ద స్థానం ఎలా సంపాదించావని ఒక మహర్షి అడిగాడట. అప్పుడు పిల్లనగ్రోవి ఇలా చెప్పిందట.

నాలో ఏమీ లేదు. ఏ కోరికలూ లేవు.. ఈ కామ, క్రోధ, లాభ, మోహ, మధ, మాత్సర్యాధి అరిషడ్వర్గాలను అదుపులో పెట్టుకుంటే జీవితం భగవంతుడు ఊదిన చక్కని స్వరంలా సాగిపోతుంది. తనదంటూ ఏదీ కోరని వారినే దేవుడు తన వద్ద ఉంచుకుంటాడని చెప్పిందట పిల్లనగ్రోవి.

**అభిరామ గుణాకర దాశరథే**
**జగదేక ధనుర్ధర ధీరమతే**
**రఘునాయక రామ రమేశ విభో**
**వరదో భవ దేవ దయాజలధే. 06**

**ప్రతి పదార్థము :**

| | |
|---|---|
| అభిరామ | = మనస్సును హరించే |
| గుణాకర | = గుణములకు స్థానమైనవాడా ! |
| దాశరథే | = ఓ దశరథుని కుమారుడైన శ్రీ రామా ! |
| జగదేక | = లోకమునకు అంతటికి ముఖ్యుడవైన |
| ధనుర్ధర | = ధనుస్సును ధరించిన గొప్పవాడా ! |



https://shanthavasanthatrust.org/books/sri-venkateshwara-suprabhatham/ 48/82

| | |
|---|---|
| ధీరమతే | = ధైర్యము కలవాడా ! |
| రఘునాయక | = రఘువంశములో శ్రేష్ఠుడా ! |
| రామ | = ఓ రామా ! |
| రమేశ | = లక్ష్మీ పతీ ! |
| విభో | = అంతటనూ వ్యాపించిన ప్రభూ ! |
| దయాజలధే | = దయకు సముద్రమువంటివాడా ! |
| దేవ | = ఓ దేవా ! |
| వరదో భవ | = వరములు అనుగ్రహించువాడివి కమ్ము. |

**అవనీ తనయా కమనీయకరం**
**రజనీకర చారు ముఖాంబురుహమ్**
**రజనీచర రాజ తమోమిహిరం**
**మహనీయ మహం రఘురామ మయే. 07**

**ప్రతి పదార్థము :**

| | |
|---|---|
| అవనీ తనయా | = సీతాదేవి చేత |
| కమనీయకరం | = కోరబడిన అందమైన చేయి కలవాడు (లేదా సీతకు ఇష్టమైనదానిని చేయువాడు) |
| రజనీకర | = రాత్రిని చేయు చంద్రునివలె |
| చారు | = అందమైన |
| ముఖాంబురుహమ్ | = ముఖ కమలము కలవాడు |
| రజనీచర | = రాత్రి పూట తిరుగు |
| రాజ | = రాక్షసుడైన రావణుడను |
| తమోమిహిరం | = చీకటికి సూర్యుడును |
| మహనీయమ్ | = మహాత్ముడు అగు |

| | |
|---|---|
| రఘురామమ్ | = రాఘవుడైన శ్రీరామ స్వరూపుడయిన వేంకటేశుని |
| అహం | = నేను |
| అయే | = పొందుచున్నాను (శరణు పొందుచున్నాను.) |

**సుముఖం సుహృదం సులభం సుఖదం**
**స్వనుజం చ సుకాయ మమోఘ శరమ్**
**అపహాయ రఘూద్వహమన్య మహం**
**న కథంచన కంచన జాతు భజే.** **08**

**ప్రతి పదార్థము :**

| | |
|---|---|
| సుముఖం | = చక్కని ముఖము కలవాడును, |
| సుహృదం | = చక్కని హృదయము కలవాడును |
| సులభం | = కష్టము లేకుండా పొందదగిన వాడును |
| సుఖదం | = సుఖమును ఇచ్చువాడును |
| స్వనుజం చ | = చక్కని సోదరులు కలవాడును |
| సుకాయమ్ | = చక్కని శారీరకాకృతి కలవాడును |
| అమోఘ శరమ్ | = వ్యర్థము కాని బాణములు కలవాడును అగు |
| రఘూద్వహమ్ | = రఘుకులోద్ధారకుడగు శ్రీ రాముని |
| అపహాయ | = విడిచి |
| అన్యమ్ | = ఇతరుని |
| కంచన | = ఎవరినైనను |
| అహం | = నేను |
| కథంచన | = ఎటులైనను |
| జాతు | = ఒకప్పుడైనను |
| న భజే | = సేవింపను |

**వినా వేంకటేశం న నాథో న నాథః**
**సదా వేంకటేశం స్మరామి స్మరామి**
**హరే వేంకటేశ ప్రసీద ప్రసీద**
**ప్రియం వేంకటేశ ప్రయచ్ఛ ప్రయచ్ఛ. 09**

**ప్రతి పదార్థము :**

| | |
|---|---|
| వేంకటేశం వినా | = శ్రీ వేంకటేశ్వరుడు కాకుండా |
| నాథః | = ప్రభువైన వాడు ఈ ప్రపంచంలో |
| న | = లేడు |
| నాథః న | = దిక్కు అయినవాడు ఇంకొకడు లేడు. |
| సదా | = ఎప్పుడు |
| వేంకటేశం | = వేంకటేశుని |
| స్మరామి | = స్మరించుచున్నాను |
| స్మరామి | = ధ్యానించుచున్నాను |
| హరే | = ఓ విష్ణు స్వరూపుడా ! |
| వేంకటేశ | = వేంకటేశ్వరుడా |
| ప్రసీద | = నాపై దయ చూపించు |
| ప్రసీద | = అనుగ్రహించు |
| వేంకటేశ | = వేంకటేశ్వరుడా |
| ప్రియం | = నాకు ఇష్టమైనదానిని (కోరుకొన్నదానిని) |
| ప్రయచ్ఛ | = ఇవ్వవలసినది |
| ప్రయచ్ఛ | = ఇమ్ము |

**విశేషాలు :** ద్విరుక్తి నాలుగు విధములుగా నుండును:

(1) పూర్వోక్తమైన మాటయే ప్రత్యయాదులతోగూడ మరల పలుకబడుట: ఉదా. గణగణ, తినితిని, అనగా అనగా, మొద.

(2) పూర్వోక్తమయిన మాట ప్రత్యయాదులయందలి మార్పులతో మరల పలుకబడుట: ఉదా. మాటిమాటికి, నేనిట్లు చెప్పినాను, చెప్పి అంతటితో ఊరుకోలేదు మొద.

(3) మొదట పలికిన మాటయే కాకున్నను, తెనుగుననైనను నితర భాషలయందయినను నదే యర్థముగల మాటను పలుకుట: ఉదా. కుండామండా, బోర్డుబల్ల, గేటువాకిలి, పేరూ, ప్రతిష్ఠ మొద.

(4) ప్రత్యయాదులలో మార్పు కలిగియు, కలుగకుండకయు, కేవల స్వరభేదము గలిగి యదేమాట మరల పలుకబడుట: ఉదా. నూనూగుమీసాలు, చిట్టి చిట్టి పలుకులు, వేడి వేడి యిడ్డెనలు మొద.

(ఆంధ్ర భాషా చరిత్రము – గంటి జోగి సోమయాజి గారు)

మన ప్రస్తుత శ్లోకంలో ద్విరుక్తి ఆదరముచేత ఏర్పడినది. (నమో నమః వలె). చెప్పిన దానిని తిరిగి చెప్పడమనేది అలంకార శాస్త్రంలో దోషం. దైవ స్మరణలో సుగుణం.

**అహం దూరతస్తే పదాంభోజ యుగ్మ**
**ప్రణామేచ్ఛయాఽఽ గత్య సేవాం కరోమి**
**సకృత్సేవయా నిత్య సేవాఫలం త్వం**
**ప్రయచ్ఛ ప్రయచ్ఛ ప్రభో వేంకటేశ.** **10**

**ప్రతి పదార్థము :**

| | |
|---|---|
| ప్రభో | = ఓ ప్రభూ ! |
| వేంకటేశ | = వేంకటేశా ! |
| అహం | = నేను |
| తే | = నీయొక్క |
| పదాంభోజ | = పాద పద్మముల |
| యుగ్మ | = జంటకు |

| | |
|---|---|
| ప్రణామ+ఇచ్ఛయా | = నమస్కరించవలెనను కోర్కెతో |
| దూరతః | = దూరమునుండి |
| ఆగత్య | = వచ్చి |
| సేవాం | = నీసేవను |
| కరోమి | = చేయుచున్నాను |
| సకృత్+సేవయా | = ఎప్పుడైనా ఒకమాటు, అరుదుగా చేయు నీసేవచేతనే |
| నిత్య సేవాఫలం | = ప్రతిరోజూ నీకు సేవ చేయు ఫలమును |
| త్వం | = నువ్వు |
| ప్రయచ్ఛ | = ఇమ్ము. |

**అజ్ఞానినా మయా దోషా**
**నశేషా న్విహితాన్ హరే**
**క్షమస్వ త్వం క్షమస్వ త్వం**
**శేషశైల శిఖామణే. 11**

**ప్రతిపదార్థం :**

| | |
|---|---|
| శేషశైల శిఖామణే | = శేషాచలమునకు(తిరుమలకు) తలమానికమైన ఓ వేంకటేశ్వరా ! |
| అజ్ఞానినా | = జ్ఞానములేని మూర్ఖుడనైన |
| మయా | = నాచేత |
| విహితాన్ | = ఆచరింపబడిన |
| అశేషాన్ | = సమస్తమైన |
| దోషాన్ | = అపరాధాలను |
| త్వం | = నీవు |
| క్షమస్వ | = క్షమింపుము |

**విశేషాలు :** 1. శేషాచలము

తిరుమలకు కృతయుగంలో వృషభాచలము, త్రేతాయుగములో అంజనాద్రి, ద్వాపరయుగములో శేషాచలము (ఆదిశేషుని రూపములో ఉన్నది కనుక శేషాచలము), కలియుగమున వేంకటాచలము అని పేర్లు

అజ్ఞాని

అజ్ఞాని పదానికి రెండు అర్థాలు 1. తెలివిలేనివాడు. 2. బ్రహ్మవేత్త కానివాడు.

ఈ రెండు అర్థాలు ఈ శ్లోకంలో సమన్వయించుకోవచ్చు.

సత్త్వ రజస్తమో గుణాల వల్ల ప్రభావితమైన మనస్సు సత్యమైన బ్రహ్మాన్ని తెలుసుకొనలేని స్థితిలో ఉంటుంది. దీనినే వేదాంత పరిభాషలో అవిద్య అనీ, అజ్ఞానమనీ అంటారు.

అజ్ఞానం ఏడు విధాలుగా ఉంటుంది. 1. బీజాగ్రము, 2. జాగ్రము, 3. మహాజాగ్రము, 4. జాగ్రత్స్వప్నము, 5. స్వప్నజాగ్రము, 6. స్వప్నము, 7. సుషుప్తి.

ఇందులో స్వప్నావస్థ అందరికీ అనుభవమే. స్వప్నంలో ఉన్నప్పుడు తదనుభవం నిజమైనదిగానే తోస్తుంది. కాని, అది నిజం కాదని జాగ్రదవస్థలోకి వచ్చాక తెలుస్తుంది. ఇదే విధంగా మిగతా ఆరు అవస్థలూ ఉంటాయి. సుషుప్తిలో అనుభవాలేమైనా ఉంటే అవి జాగ్రదవస్థలో జ్ఞాపకానికి రావు. వస్తే అది సుషుప్తికాదు. ఇలా ఏడు రూపాలుగ ఉండే అజ్ఞానావస్థలకు ఈ పేర్లు పెట్టారు.

సప్త అజ్ఞాన భూమికలుగా ఇంకా ఇవి కూడా వాడుకలో ఉన్నాయి. 1. అజ్ఞానం, 2. ఆవరణం, 3. విక్షేపం, 4. పరోక్ష జ్ఞానం, 5. అపరోక్షజ్ఞానం, 6. నిరంకుశ తృప్తి, 7. అత్యంతిక దుఃఖ నాశం.



# 03. శ్రీ వేంకటేశ ప్రపత్తి

భక్తిపరులుచేయు శరణాగతిని ప్రపత్తి అంటారు.

ఏదైనా కావాలను కొన్నది సాధించటం కష్టమని అనుకొన్నప్పుడు దానిని సాధించిపెట్టవలసిందని ప్రార్థన పూర్వకంగా ఎవరినైనా కోరడం, బాధ్యతను ఇంకొకరిపై ఉంచడం ప్రపత్తి.

ప్రపత్తికి ముందు రావలసిన భావనలు

1. కర్తృత్వ త్యాగం,
2. మమతా త్యాగం,
3. ఫల త్యాగం,
4. ఫలోపాయత్వ త్యాగం (అంటే, ఫలసిద్ధి కోసం శరణాగతిని చేయడం అనే భావనను మనసు నుంచి తొలగించవలసి ఉంది.)

శ్రీ వేంకటేశ ప్రపత్తిలో మొదటి శ్లోకం.

**ఈశానం జగతోస్య వేంకటపతే ర్విష్ణోః పరాం ప్రేయసీమ్**
**తద్వక్షస్థల నిత్యవాసరసికాం తత్ క్షాంతి సంవర్ధనీమ్**
**పద్మాలంకృత పాణిపల్లవ యుగాం పద్మాసనస్థాం శ్రియం**
**వాత్సల్యాది గుణోజ్జ్వలాం భగవతీం వందే జగన్మాతరమ్. 01**

**ప్రతిపదార్థం :**

| | |
|---|---|
| అస్య జగతః | = ఈ ప్రపంచానికి |
| ఈశానం | = యజమానురాలైన |
| వేంకటపతేః | = వేంకటనాథుడైన |

విష్ణోః = విష్ణుదేవునికి
పరాం = గొప్పదయిన
ప్రేయసీమ్ = ప్రియురాలైన
తద్వక్షస్థల నిత్యవాసర సికాం = ఆవిష్ణుమూర్తి వక్షః స్థలములో ఎప్పుడు నివాసము చేయుటయందు ఆసక్తి కలిగినదియూ
తత్ క్షాంతి సంవర్ధనీమ్ = ఆవిష్ణుమూర్తి ఓర్పు గుణమును పెంచునదియు
పద్మాలంకృత పాణిపల్లవ యుగాం = తామరపూవులచే అలంకరింపబడిన చిగురులను పోలిన చేతులు కలిగినదియు
పద్మాసనస్థాం = కమలమను ఆసనమున లేక పద్మాసనమను ఆసన విశేషమున ఉన్నదియు
వాత్సల్యాది గుణోజ్జ్వలాం = ప్రీతి మొదలైన సుగుణములచే ప్రకాశించునదియు
జగన్మాతరమ్ = ఈ ప్రపంచమునకు తల్లివంటిదియు అగు
భగవతీం = పూజ్యురాలయిన
శ్రియం = లక్ష్మీదేవిని(కి)
వందే = నమస్కరించుచున్నాను.

**విశేషాలు :**

మనపై స్వామి దయతలచాలంటే అమ్మ అనుగ్రహం తప్పనిసరిగా కావాలి. అందుకే ప్రపత్తి ఆ తల్లిప్రార్థనతో ప్రారంభమయింది. వేదాంతదేశికుల రచనల శ్రీస్తుతి కూడా ఇదే శ్లోకంతో ప్రారంభం కావటం గమనార్హం.

3/30/25, 7:18 PM PDF.js viewer



**శ్రీమన్ కృపాజలనిధే! కృతసర్వలోక!**
**సర్వజ్ఞ! శక్త !నతవత్సల! సర్వశేషిన్**
**స్వామిన్ !సుశీల సులభాశ్రిత పారిజాత**
**శ్రీ వేంకటేశ! చరణౌ శరణం ప్రపద్యే. 02**

**ప్రతిపదార్థం :**

| | |
|---|---|
| శ్రీమన్ | = సంపదతో కూడినవాడా! |
| కృపాజలనిధే! | = దయకు సముద్రమువంటివాడా ! |
| కృతసర్వలోక! | = చేయబడిన సమస్త ప్రపంచము కలిగినవాడా! |
| సర్వజ్ఞ! | = సమస్తము తెలిసినవాడా ! |
| శక్త ! | = సమర్థుడా! |
| నతవత్సల! | = నమస్కరించినవారియందు ప్రీతి కలిగినవాడా! |
| సర్వశేషిన్ | = చేతనా చేతన ప్రపంచంలో సర్వ ప్రధానుడా! |
| స్వామిన్ ! | = ఓ దేవా ! |
| సుశీల సులభ | = మంచి స్వభావము కలవారికి పొందుటకు శక్యమైనవాడా! |
| శ్రితపారిజాత | = ఆశ్రయించినవారికి పారిజాతము (కల్పవృక్షము) వంటివాడా ! |
| శ్రీ వేంకటేశ! | = శ్రీ వేంకటేశ్వరుడా ! |
| చరణౌ | = నీ పాదముల జంటను |
| శరణం | = శరణముగా |
| ప్రపద్యే | = పొందుచున్నాను. |

**విశేషాలు :**

స్వామిని నమ్మళ్వార్ "పాదాల" రూపంలో పూజించాడు. పద్యతే గమ్యతే అనేన – దేనితో వెళ్లుదురో అది పాదము. వేంకటేశ్వరుని



https://shanthavasanthatrust.org/books/sri-venkateshwara-suprabhatham/ 57/82

3/30/25, 7:18 PM PDF.js viewer



పాదముతో ఈ సంసారమునుంచి మానవులు అమృతమయమైన లోకానికి వెళ్ళుదురు. అలా మనలను తీసుకు వెళ్ళగలిగిన పాదాలకు ఈ ప్రపత్తిలో శరణం కోరుట జరుగుచున్నది.

**ఆనూపురార్పిత సుజాత సుగంధి పుష్ప**
**సౌరభ్య సౌరభకరౌ సమసన్నివేశౌ**
**సౌమ్యౌ సదానుభవనే ఽ పి నవానుభావ్యౌ**
**శ్రీ వేంకటేశ చరణౌ శరణం ప్రపద్యే. 03**

**ప్రతిపదార్థం :**

| | |
|---|---|
| ఆనూపురార్పిత | = కాలిఅందెల వరకు సమర్పింపబడిన |
| సుజాత | = చక్కటి పుట్టుక కలిగిన |
| సుగంధి | = మంచి వాసన కలిగిన |
| పుష్ప | = పూల |
| సౌరభ్య | = సువాసనకు |
| సౌరభకరౌ | = పరిమళము కలుగచేయు |
| సమసన్నివేశౌ | = సమానమైన సన్నివేశము కలవియు ( చక్కగా సమర్పింపబడినవియు) |
| సౌమ్యౌ | = ప్రసన్నములైనవియు |
| సదా | = ఎప్పుడు |
| అనుభవనేంఅపి | = అనుభవములో ఉన్నను |
| నవానుభావ్యౌ | = కొత్తవిగా అనుభవింపమనసుగొల్పునవిఅగు |
| శ్రీ వేంకటేశ! | = శ్రీ వేంకటేశ్వరుడా ! |
| చరణౌ | = నీ పాదముల జంటను |
| శరణం | = శరణముగా |



https://shanthavasanthatrust.org/books/sri-venkateshwara-suprabhatham/ 58/82

ప్రపద్యే = పొందుచున్నాను.

**విశేషాలు :**

శ్రీరంగనాథ స్వామి పాదాలు పరిమళ భరితాలని వేదాంతదేశికులవారు తమ పాదుకా సహస్రంలో చెప్పారు. ఈ ప్రపత్తిలో కూడా ఆ పరిమళ ప్రస్తావన ఉండుట గమనార్హం.

**సద్యో వికాసి సముదిత్వర సాంద్రరాగ**
**సౌరభ్య నిర్భర సరోరుహ సామ్యవార్తామ్**
**సమ్యక్షు సాహస పదేషు విలేఖయంతౌ**
**శ్రీ వేంకటేశ చరణౌ శరణం ప్రపద్యే. 04**

**ప్రతిపదార్థం :**

సద్యో వికాసి = అప్పుడే వికసించినవియు
సముదిత్వర = బాగా పుట్టుచున్న
సాంద్రరాగ = దట్టమైన ఎఱుపు తనము
సౌరభ్య = పరిమళములచే
నిర్భర = అధికమయిన
సరోరుహ = తామరపూవుల
సామ్యవార్తామ్ = పోలికల మాటను
సమ్యక్షు = చక్కనివియగు(మంచివియగు)
సాహస పదేషు = తొందరగా ఉంచబడిన పాదాల గుర్తులందు (లేదా సాహస స్థానములందు)
విలేఖయంతౌ = వ్రాయించునవి యగు (స్వామి పాదములకు కమలముల సామ్యమును చెప్పుట సాహసమని భావము)

| | |
|---|---|
| శ్రీ వేంకటేశ! | = శ్రీ వేంకటేశ్వరుడా ! |
| చరణౌ | = నీ పాదముల జంటను |
| శరణం | = శరణముగా |
| ప్రపద్యే | = పొందుచున్నాను. |

**రేఖామయ ధ్వజ సుధా కలశాత పత్ర**
**వజ్రాంకుశాంబురుహ కల్పక శంఖ చక్రైః**
**భవ్యై రలంకృత తలౌ పరతత్త్వ చిహ్నైః**
**శ్రీ వేంకటేశ చరణౌ శరణం ప్రపద్యే.** **05**

**ప్రతిపదార్థం :**

| | |
|---|---|
| భవ్యైః | = క్షేమము కలిగించు గొప్పవైన |
| రేఖామయ | = రేఖల రూపముగా ఉన్న |
| ధ్వజ | = ధ్వజము(టెక్కెము) |
| సుధా కలశ | = అమృత కలశము |
| ఆత పత్ర | = ఛత్రము(గొడుగు) |
| వజ్ర | = వజ్రము |
| అంకుశ | = అంకుశము చివర వంపుగ నుండునది. ఏనుగు కుంభస్థలమునందుబొడిచెడి యాయుధము, |
| అంబురుహ | = పద్మము |
| కల్పక | = కల్పవృక్షము |
| శంఖ | = శంఖము |
| చక్రైః | = చక్రము మొదలైన వాని చేత |
| పరతత్త్వ చిహ్నైః | = పరమార్థపు గుర్తుల చేత |

3/30/25, 7:18 PM PDF.js viewer



| | |
|---|---|
| అలంకృత తలౌ | = అలంకరింపబడిన ప్రదేశములు గల |
| శ్రీ వేంకటేశ! | = శ్రీ వేంకటేశ్వరుడా ! |
| చరణౌ | = నీ పాదముల జంటను |
| శరణం | = శరణముగా |
| ప్రపద్యే | = పొందుచున్నాను. |

**విశేషాలు :**

చక్రం, శంఖం, గద, ధనస్సు , ఖడ్గం అను స్వామి వారి పంచాయుధాలు దివ్యమంత్రశక్తులు కలిగినవి. వాటి గొప్పతనం వివిధ పురాణ కథలలో మనం చదువుకోవచ్చు. ప్రత్యేకంగా ఈ ఆయుధాల గురించి వ్రాసిన పంచాయుధ స్తోత్రం ప్రసిద్ధమైనది. ఈ ప్రపత్తి శ్లోకంలో అవి స్వామివారికి అలంకారాలని మనోహరంగా తెలియచేయబడింది.

**తామ్రోదరద్యుతి పరాజిత పద్మరాగౌ**
**బాహ్యై ర్మహోభి రభిభూత మహేంద్రనీలౌ**
**ఉద్య న్నఖాంశుభి రుదస్త శశాంకభాసౌ**
**శ్రీ వేంకటేశ చరణౌ శరణం ప్రపద్యే. 06**

**ప్రతిపదార్థం :**

| | |
|---|---|
| తామ్రోదర | = ఎర్రనైన అడుగు భాగమగు అరికాలియొక్క |
| ద్యుతి | = కాంతిచేత |
| పరాజిత | = తిరస్కరింపబడిన |
| పద్మరాగౌ | = పద్మరాగములను రత్నములు కలవియు (పద్మముల ఎరుపుతనము కలిగినవియు) |
| బాహ్యైః | = బయటివగు |
| మహోభిః | = కాంతులచేత |
| అభిభూత | = తిరస్కరింపబడిన |



https://shanthavasanthatrust.org/books/sri-venkateshwara-suprabhatham/ 61/82

| | |
|---|---|
| మహేంద్రనీలౌ | = మహేంద్ర నీలములు కలవియు |
| ఉద్యత్ | = పైకి ఎగయుచున్న |
| నఖాంశుభిః | = గోటి కాంతులచేత |
| ఉదస్త | = తిరస్కరింపబడిన |
| శశాంకభాసౌ | = చంద్రకాంతులు కలిగిన |
| శ్రీ వేంకటేశ! | = శ్రీ వేంకటేశ్వరుడా ! |
| చరణౌ | = నీ పాదముల జంటను |
| శరణం | = శరణముగా |
| ప్రపద్యే | = పొందుచున్నాను. |

**స ప్రేమ భీతి కమలాకర పల్లవాభ్యాం**
**సంవాహనేఽపి సపది క్లమ మాదధానౌ**
**కాంతావవాఙ్మనసగోచర సౌకుమార్యౌ**
**శ్రీ వేంకటేశ చరణౌ శరణం ప్రపద్యే. 07**

**ప్రతిపదార్థం :**

| | |
|---|---|
| కమలా | = లక్ష్మీదేవి తన |
| కర పల్లవాభ్యాం | = చిగురుల వంటి చేతులతో |
| స ప్రేమ భీతి | = కందిపోతుందనే ప్రేమ, భయము వంటి భావాలతో |
| సంవాహనేఽపి | = ఒత్తినప్పటికి; |
| సపది | = వెంటనే; |
| క్లమమ్ | = బాధను (కందిపోవునవియు) |
| ఆదధానౌ | = పొందునవియు |
| కాంతౌ | = అందమైనవియు |
| అవాఙ్మనసగోచర | = వాక్కునకు, మనస్సుకు కనిపింపని |

| | |
|---|---|
| సౌకుమార్యౌ | = సుకుమారత్వము కలిగినవియు అగు |
| శ్రీ వేంకటేశ చరణౌ | = శ్రీ వేంకటేశ్వరుని పాదముల జంటను |
| శరణం | = శరణముగా |
| ప్రపద్యే | = పొందుచున్నాను. |

**లక్ష్మీ మహీ తదనురూప నిజానుభావ**
**నీలాది దివ్య మహిషీ కరపల్లవానామ్**
**ఆరుణ్య సంక్రమణతః కిల సాంద్రరాగౌ**
**శ్రీ వేంకటేశ చరణౌ శరణం ప్రపద్యే. 08**

**ప్రతిపదార్థం :**

| | |
|---|---|
| లక్ష్మీ | = లక్ష్మీదేవి |
| మహీ | = భూదేవి |
| తత్+అనురూప | = వీరలకు అనుగుణముగా |
| నిజ+అనుభావ | = స్వానుభావముగల (భావమును దెలిపెడి ముఖవిలాసాదులు) |
| నీలాది = నీల+ఆది | = నీళాదేవి మొదలగు |
| దివ్య మహిషీ | = దివ్యులగు పట్టపురాణులయొక్క |
| కరపల్లవానామ్ | = కరపల్లవములయొక్క |
| ఆరుణ్య సంక్రమణతః | = ఎరుపుదనము యొక్క కలయిక వలన |
| కిల | = నిశ్చయముగా |
| సాంద్రరాగౌ | = దట్టమైన ఎరుపుదనము కలవియగు |
| శ్రీ వేంకటేశ చరణౌ | = శ్రీ వేంకటేశ్వరుని పాదముల జంటను |
| శరణం | = శరణముగా |
| ప్రపద్యే | = పొందుచున్నాను |

**నిత్యా నమద్విధి శివాది కిరీటకోటి**
**ప్రత్యుప్త దీప్త నవరత్న మహః ప్రరోహైః**
**నీరాజనా విధి ముదార ముపాదధానౌ**
**శ్రీ వేంకటేశ చరణౌ శరణం ప్రపద్యే. 09**

| | |
|---|---|
| నిత్యా | = నిత్యము |
| నమత్ | = నమస్కరించు |
| విధి | = బ్రహ్మ |
| శివంఆది | = శివుడు మొదలగు |
| కిరీట | = కిరీటముల |
| కోటి | = పై భాగములందు |
| ప్రత్యుప్త | = వెదజల్లబడిన |
| దీప్త | = ప్రకాశవంతములైన |
| నవరత్న | = నవరత్నముల |
| మహః ప్రరోహైః | = కాంతిమొలకలచే |
| నీరాజనా విధిమ్ | = మంగళహారతి క్రియను |
| ఉదారమ్ | = అధికముగా |
| ఉపాదధానౌ | = పొందుచున్నవి. |
| శ్రీ వేంకటేశ చరణౌ | = శ్రీ వేంకటేశ్వరుని పాదముల జంటను |
| శరణం | = శరణముగా |
| ప్రపద్యే | = పొందుచున్నాను |

**విశేషాలు :**

నవరత్నములు : వజ్రము (diamond), వైడూర్యము (lapis-lazuli cats eye), గోమేధికము (agate), పుష్యరాగము (topaz), నీలము (sapphire), మరకతము (emerald), మాణిక్యము (ruby), విద్రుమము (coral), మౌక్తికము (pearl).

3/30/25, 7:18 PM PDF.js viewer



**"విష్ణోః పదే పరమ" ఇత్యుదిత ప్రశంసౌ**
**యౌ 'మధ్వఉత్స' ఇతి భోగ్యతయా ఽప్యుపాత్తౌ**
**భూయ స్తథేతి తవ పాణితలౌ ప్రతిష్ఠౌ**
**శ్రీ వేంకటేశ చరణౌ శరణం ప్రపద్యే. 10**

**ప్రతిపదార్థం :**

| | |
|---|---|
| శ్రీ వేంకటేశ | = శ్రీవేంకటేశా ! |
| "విష్ణోః పదే పరమ" | = విష్ణుమూర్తి యొక్క ఉత్కృష్ట స్థానములోని (వైకుంఠములో) |
| యౌ | = (ఏ) పాదములు |
| 'మధ్వఉత్స' | = తేనెయొక్క ఊటలు |
| ఇతి ఉదిత ప్రశంసౌ | = అని ఋగ్వేదములో ప్రశంసింపబడుచున్నావో |
| భోగ్యతయా+అపి | = అనుభవయోగ్యముగా |
| ఉపాత్తౌ | = పొగడబడినవో |
| భూయః | = మరల |
| తథా+ఇతి | = అవిధంగా పాదములను తేనె ఊటలని |
| తవ | = నీయొక్క |
| పాణితలౌ | = అరచేతి చేత |
| ప్రతిష్ఠౌ | = నిర్దేశింపబడినటువంటి |
| (తౌ)చరణౌ | = అటువంటి పాదముల జంటను |
| శరణం | = శరణముగా |
| ప్రపద్యే | = పొందుచున్నాను |

**పార్థాయ తత్సదృశ సారథినా త్వయైవ**
**యౌ దర్శితౌ స్వచరణౌ శరణం వ్రజేతి**



https://shanthavasanthatrust.org/books/sri-venkateshwara-suprabhatham/ 65/82

**భూయోపి మహ్యా మిహ తౌ కరదర్శితౌ తే**
**శ్రీ వేంకటేశ చరణౌ శరణం ప్రపద్యే. 11**

**ప్రతిపదార్థం :**

పార్థాయ = అర్జునుని కొరకు
తత్సదృశ = అతనితో సమానమైన
సారథినా = సారథివగు
త్వయైవ(త్వయాంఏవ) = నీ చేతనే
యౌ = ఏ
స్వచరణౌ = స్వకీయ చరణముల జంట
శరణం వ్రజేతి (వ్రజంఇతి) = శరణము పొందుము అని
దర్శితౌ = చూపబడినవో
తౌ = ఆ చరణముల జంట
భూయోపి (భూయఃంఅపి)= మరలా
మహ్యామ్ = నా కొరకు
ఇహ = ఇక్కడ (ఈ భూలోకములో)
కరదర్శితౌ = చేతిచే చూపబడిన
శ్రీ వేంకటేశ = శ్రీ వేంకటేశ్వర స్వామీ !
తే = నీయొక్క
చరణౌ = పాదముల జంటను
శరణం ప్రపద్యే = శరణు కోరుచున్నాను.

**మున్మూర్ధ్ని కాళియఫణే వికటాటవీషు**
**శ్రీ వేంకటాద్రి శిఖరే శిరసి శ్రుతీనామ్**
**చిత్తే ప్యనన్య మనసాం సమమాహితౌ తే**
**శ్రీ వేంకటేశ చరణౌ శరణం ప్రపద్యే. 12**

**ప్రతిపదార్థం :**

| | |
|---|---|
| శ్రీ వేంకటేశ | = శ్రీ వేంకటేశ్వరా ! |
| మన్మూర్ధ్ని | = నా శిరమునందు |
| కాళియఫణే | = కాళియుడను పేరు కలిగిన పాము యొక్క పడగయందు |
| వికటాటవీషు | = భయంకరములైన అడవులయందు |
| శ్రీ వేంకటాద్రి శిఖరే | = శ్రీ వేంకటాచల శిఖరమునందు |
| శ్రుతీనామ్ శిరసి | = వేదములకు శిరమయిన ఉపనిషత్తుల యందు |
| అనన్య మనసాం | = దేవుని ధ్యానము తప్ప ఇతర విచారములు లేని మనస్సు కలిగిన మునీశ్వరుల యొక్క |
| చిత్తేఽపి | = హృదయమందు |
| సమం | = సమానముగా |
| ఆహితౌ | = ఉంచబడిన |
| తే | = నీ యొక్క |
| చరణౌ | = పాదముల జంటను |
| శరణం ప్రపద్యే | = శరణు కోరుచున్నాను |

**అమ్లాన హృష్య దవనీతల కీర్ణ పుష్పౌ**
**శ్రీ వేంకటాద్రి శిఖరాభరణాయమానౌ**
**ఆనందితాఖిల మనోనయనౌ తవైతౌ**
**శ్రీ వేంకటేశ! చరణౌ శరణం ప్రపద్యే. 13**

**ప్రతిపదార్థం :**

| | |
|---|---|
| అమ్లాన | = వాడకయే |
| హృష్యతౌ | = వికసించు |
| అవనీతల | = భూతలమున |

| | |
|---|---|
| కీర్ణ పుష్పౌ | = చల్లబడిన పూలు కలవియు (భూమిలో వాడక వ్యాపించిన పూల వలె వేంకటేశుని పాదములు ఉన్నాయని భావం) |
| శ్రీ వేంకటాద్రి శిఖర | = శ్రీ వేంకటాచల శిఖరానికి |
| ఆభరణాయమానౌ | = అలంకారములుగా ఉన్నవియు అయిన |
| ఆనందిత | = ఆనందింపచేయబడిన |
| అఖిల | = సమస్త జనుల |
| మనోనయనౌ | = మనస్సులు నేత్రములుగా కలవియు అగు |
| తవ | = నీయొక్క |
| ఏతౌ | = ఈ |
| చరణౌ | = పాదములజంటను |
| శరణం ప్రపద్యే | = శరణు పొందుచున్నాను. |

**విశేషాలు :**

మనస్సులను నేత్రములకు ఆనందమును కల్గించు (ఆనందితాఖిల మనోనయనౌ) అనుట అద్భుతమైన ప్రయోగము. సాధారణంగా కళ్లద్వారా ఏ వస్తువునైనా చూస్తాం. అందులో ఇష్టం ఉండవచ్చు. లేకపోవచ్చు. కాని స్వామి వారి పాదాలను మనస్సుతో (మనస్సు పెట్టి) అనగా ఇష్టంతో చూస్తారని అద్భుతమైన భావనను మహర్షి వర్ణించారు.

**ప్రాయః ప్రపన్న జనతా ప్రథమావగాహ్యౌ**
**మాతుః స్తనావివ శిశో రమృతాయమానౌ**
**ప్రాప్తౌ పరస్పర తులామతులాంతరౌ తే**
**శ్రీ వేంకటేశ చరణౌ శరణం ప్రపద్యే.** **14**

**ప్రతిపదార్థం :**

| | |
|---|---|
| శ్రీ వేంకటేశ | = శ్రీ వేంకటేశా ! |
| ప్రాయః | = తరచుగా |
| ప్రపన్న | = నమస్కరించు(శరణుకోరు) |
| జనతా | = జన సమూహముచే |
| ప్రథమంఅవగాహ్యౌ | = మొట్టమొదట గ్రహింపదగినవియు |
| శిశోః | = చిన్నబిడ్డకు |
| మాతుః స్తనావివ | = తల్లి చన్నుల వలె |
| అమృతాయమానౌ | = అమృతమువలె అగుచున్నవియు |
| అతులాంతరౌ | = ఇతర వస్తువుల పోలిక లేనివియు |
| పరస్పర తులామ్ | = పరస్పరపు పోలికను |
| ప్రాప్తౌ | = పొందినవియు అగు |
| తే | = నీయొక్క |
| చరణౌ | = పాదములజంటను |
| శరణం ప్రపద్యే | = శరణు పొందుచున్నాను. |

**సత్త్వోత్తరై స్సతత సేవ్యపదాంబుజేన**
**సంసార తారక దయార్ద్ర దృగంచలేన**
**సౌమ్యోపయంతృ మునినా మమ దర్శితౌ తే**
**శ్రీ వేంకటేశ చరణౌ శరణం ప్రపద్యే. 15**

**ప్రతిపదార్థం :**

| | |
|---|---|
| శ్రీ వేంకటేశ | = శ్రీ వేంకటేశ్వర స్వామీ! |
| సత్త్వోత్తరైః | = ఉత్తమమైన సత్వగుణముచే శ్రేష్ఠులగు సాత్వికులచే |

సతత సేవ్యపదాంబుజేన= ఎప్పుడూ సేవింపబడు పాద పద్మములు గలిగినవాడు

సంసార తారక దయార్ద్ర దృగంచలేన = సంసారమును దాటించు దయతో తడిసిన కనుగొనలు కలిగినట్టి వాడు అగు

సౌమ్యోపయంతృ మునినా= రమ్య జామాతృ మునిచే (మణవాళ మహా మునిచే)

మమ దర్శితౌ = నాకు చూపబడినటువంటి

తే = నీయొక్క

చరణౌ = పాదములజంటను

శరణం ప్రపద్యే = శరణు పొందుచున్నాను.

**శ్రీశ శ్రియా ఘటికయా త్వదుపాయభావే**
**ప్రాప్యే త్వయి స్వయముపేయతయా స్ఫురంత్యా**
**నిత్యాశ్రితాయ నిరవద్య గుణాయ తుభ్యం**
**స్యాం కింకరో వృషగిరీశ నజాతు మహ్యమ్. 16**

**ప్రతిపదార్థం :**

శ్రీశ = లక్ష్మీపతీ!

వృషగిరీశ = ఓ వృషశైలాధిపతీ!

త్వదుపాయభావే = మోక్ష మార్గమునకు నీవే ఉపాయభూతుడవు, (పరమపదము చెందుటకుసాధనభూతుడవు అగుచుండగా)

ఘటికయా = లక్ష్మీ దేవి సంధానకురాలు అగుచున్నది.

త్వయి = నీవు

| | |
|---|---|
| ప్రాప్యే సతి | = పొందదగినవాడివగుచుండగా (ఉపేయుడివి అగుచుండగా) |
| స్వయమ్ | = తానే |
| ఉపేయతయా | = ఉపేయభావమును పొందునదిగా (ఉపాయముచే సాధ్యమైనదానిని ఉపేయము అంటారు) |
| స్ఫురంత్యా | = ప్రకాశించునటువంటిదయిన |
| శ్రియా | = లక్ష్మీదేవి చేత |
| నిత్యంఆశ్రితాయ | = ఎప్పుడూ ఆశ్రయింపబడినవాడవు |
| నిరవద్య గుణాయ | = దోషములు లేని మేలిగుణములు కలవాడవు అగు |
| తుభ్యం | = నీకు |
| కింకరః | = సేవకుడను |
| స్యాం | = అగుచున్నాను |
| మహ్యామ్. | = నాకు నేను |
| జాతు | = ఒకప్పుడును |
| నస్యాం | = సేవకుడను కాను. |

**విశేషాలు :**

వృషశైలము అను పేరు వేంకటాద్రికి నామాంతరము. కృతయుగంలో వృషుడని పిలువబడు ధర్మదేవత శేషాద్రిపై తపస్సు చేయుచుండగా ధర్మము అభివృద్ధి పొందినది. భగవంతుడు ప్రత్యక్షమై "వృషా" నీవు చేసిన తపమునకు లోకమున ధర్మము అభివృద్ధిపొందినది. కావున ఈ పర్వతమునకు నీ పేరుతో 'వృషాద్రి' అను ప్రఖ్యాతి కలుగును" అని వరమొసంగెను. ఆనాటినుండి శేషాద్రి, వృషాద్రి అను పేరుతో ప్రసిద్ధమైనదని వామనపురాణ కథనము (అధ్యాయం. 21-38-42 శ్లో!!).

3/30/25, 7:18 PM PDF.js viewer



వృషమనగా ధర్మము. ధర్మదేవత స్వాభివృద్ధి కొరకు ఈ పర్వతమున తపస్సు చేయుటచే వేదపారంగతులైన మునులు దీనిని 'వృషాద్రి' అని పిలిచిరని వరాహపురాణము (అధ్యా. 36-23 శ్లో!!) వర్ణించినది.

శ్రీ వేంకటేశ్వర అష్టోత్తర శతనామావళిలో వృషదృగ్గోచరాయ నమః (2) వృషాద్రి పతయే నమః (6) అను నామములు గలవు. వృషునికి కనిపించినవాడు, వృషాద్రికి అధిపతి యని భావము. వృషాద్రికే ధర్మగిరి అని నామాంతరము గలదు. వృషనామమనగా ధర్మము. (ఆధార గ్రంథము శ్రీ వేంకటేశ సుప్రభాత మంజరి డా॥ కె.వి.రాఘవాచార్య.)





https://shanthavasanthatrust.org/books/sri-venkateshwara-suprabhatham/ 72/82

# 04. శ్రీ వేంకటేశ మంగళాశాసనములు

వైష్ణవపరిభాషలో ఆశీర్వాదమును మంగళాశాసనము అంటారు.

**శ్రియఃకాంతాయ కల్యాణ నిధయే నిధయేఽర్థినామ్**
**శ్రీ వేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్. 01**

**ప్రతి పదార్థము :**

| | |
|---|---|
| శ్రియః | = లక్ష్మీదేవికి |
| కాంతాయ | = ప్రియుడైనవాడును, (ఇష్టుడైనవాడును) |
| కల్యాణ నిధయే | = శుభములకు స్థానమైనవాడును |
| అర్థినామ్ | = ప్రార్థించు యాచకులకు |
| నిధయే | = గని (నిధి)వంటివాడును |
| శ్రీ వేంకట నివాసాయ | = శ్రీ వేంకట పర్వతమున నివసించువాడైన |
| శ్రీనివాసాయ | = శ్రీనివాసమూర్తికి |
| మంగళమ్ | = మంగళము అగుగాక! |

**లక్ష్మీ సవిభ్రమాలోక సుభ్రూ విభ్రమ చక్షుషే**
**చక్షుషే సర్వలోకానాం వేంకటేశాయ మంగళమ్. 02**

**ప్రతి పదార్థము :**

| | |
|---|---|
| లక్ష్మీ | = లక్ష్మీదేవిని |
| సవిభ్రమ+ఆలోక | = ఆశ్చర్యముతో చూచు |
| సుభ్రూ | = చక్కని కనుబొమలు కల |

3/30/25, 7:18 PM PDF.js viewer



| | |
|---|---|
| వి(భమ చక్షుషే | = విలాసపు కన్నులు కలవాడును, |
| సర్వలోకానాం | = అన్ని లోకములకు(సర్వ జీవులకు) |
| చక్షుషే | = నే(త్రము వంటివాడును అగు |
| వేంకటేశాయ | = వేంకటేశునికి |
| మంగళమ్ | = మంగళము అగుగాక! |

**విశేషాలు :** వి(భమమునకు ఉన్న ఇతర అర్థాలివి.

1. వాక్ - అంగ - ఆహార్య - సత్వములకు సంబంధించిన వివిదార్ధములను మదముచేగాని, హర్షముచేగాని, రాగముచేగాని. వ్యత్యస్తముగా చేయుట ''వి(భమ'' మనబడును.(కూచిపూడి కళాసాగరము హేమా(ద్రి చిదంబరదీక్షితులు)
2. ఒక వస్తువును మరి ఒక వస్తువుగా తలచుట (గా(త్రజానుభావములలో ఒకటి)
3. విశేషమైన చలనము వి(భమము

**(శ్రీ వేంకటా(ద్రి శృంగా(గ్ర మంగళాభర ణాం(ఘ్రయే**
**మంగళానాం నివాసాయ (శ్రీనివాసాయ౾ మంగళమ్. 03**

**(ప్రతి పదార్థము :**

| | |
|---|---|
| (శ్రీ వేంకట +అ(ద్రి | = (శ్రీ వేంకటాచల పర్వతపు |
| శృంగ +అ(గ | = శిఖరా(గమునకు |
| మంగళ +ఆభరణ | = శుభకరమైన(చక్కని) ఆభరణమైన |
| అం(ఘ్రయే | = పాదములు కలిగినవాడును |
| మంగళానాం | = సమస్త శుభములకు |
| నివాసాయ | = నిలయమైనవాడును అగు |
| (శ్రీనివాసాయ | = (శ్రీనివాసునికి |



https://shanthavasanthatrust.org/books/sri-venkateshwara-suprabhatham/ 74/82

| | |
|---|---|
| మంగళమ్ | = మంగళమగుగాక! |

**తా.** శ్రీ వేంకటాచల శిఖరాగ్రమునకు చక్కని అలంకారమైన పాదములు కలవాడును, సమస్త మంగళములకు నిలయమైనవాడును అగు శ్రీనివాసునికి మంగళమగు గాక.

**విశేషాలు :** మంగళము

మంగం సుఖం లాతీతి మంగళం. లాదానే. సుఖమును ఇచ్చునది కనుక శుభాన్ని మంగళమంటారు.

**సర్వావయవ సౌందర్య సంపదా సర్వచేతసాం**
**సదా సమ్మోహనాయాస్తు వేంకటేశాయ మంగళమ్. 04**

**ప్రతి పదార్థము :**

| | |
|---|---|
| సర్వ+అవయవ | |
| సౌందర్య సంపదా | = సమస్తమైన అవయవముల యొక్క సౌందర్య సంపద చేత |
| సర్వచేతసాం | = సమస్త మానవులకు |
| సదా | = ఎప్పుడు |
| సమ్మోహనాయ | = సమ్మోహనము (ఆకర్షణము) కలుగచేయువాడగు |
| వేంకటేశాయ | = శ్రీ వేంకటేశ్వర స్వామికి |
| మంగళమ్ | = శుభము |
| అస్తు | = కలుగుగాక ! |

**తాత్పర్యము:**

తన సర్వావయవముల యొక్క సౌందర్య సంపదచే, సమస్త ప్రాణులకును సమ్మోహమును కలుగచేయు శ్రీ వేంకటేశ్వరునికి శుభమగు గాక.

3/30/25, 7:18 PM PDF.js viewer



**విశేషాలు :** సౌన్దర్యము

సుతరాం అద్రియత ఇతి సుందరం. సౌందర్యమ్. దృ ఆదరే. బాగా సంతోషపెట్టునది అని సౌందర్య పదానికి అర్థం.

**నిత్యాయ నిరవద్యాయ సత్యానంద చిదాత్మనే**
**సర్వాంతరాత్మనే శ్రీమద్వేంకటేశాయ మంగళమ్. 05**

**ప్రతి పదార్థము :**

| | |
|---|---|
| నిత్యాయ | = మూడు కాలములచేత బాధింపబడనివాడు, నాశనము లేనివాడు |
| నిరవద్యాయ | = దోషములు లేనివాడు |
| సత్య+ఆనంద+చిత్+ఆత్మనే | = సత్యము, ఆనందము, చిత్తు(బుద్ధి) అను వానియొక్క నిజ స్వరూపముగా ఉండు |
| సర్వ+అంతరాత్మనే | = సమస్త ప్రాణుల అంతరాత్మ అయిన |
| శ్రీమద్వేంకటేశాయ | = లక్ష్మీ సమేతుడైన శ్రీ వేంకటేశునికి |
| మంగళమ్ | = శుభము కలుగుగాక ! |

**విశేషాలు :** చిత్ (బుద్ధి )

చేతంయత్యనయేతి చిత్. చితీ సంజ్ఞానే. దీనిచేత జ్ఞానయుక్తులగుదురు.

**స్వత స్సర్వ విదే సర్వశక్తయే సర్వ శేషిణే**
**సులభాయ సుశీలాయ వేంకటేశాయ మంగళమ్. 06**

**ప్రతి పదార్థము :**

| | |
|---|---|
| స్వతః | = తనకు తానే |
| సర్వ విదే | = సమస్తము తెలిసినవాడును |



https://shanthavasanthatrust.org/books/sri-venkateshwara-suprabhatham/ 76/82

| | | |
|---|---|---|
| సర్వశక్తయే | = | సమస్త శక్తిసంపన్నుడును |
| సర్వ శేషిణే | = | సమస్తమునకు ప్రధానమైనవాడును |
| సులభాయ | = | సులభముగా పొందుటకు వీలగువాడును |
| సుశీలాయ | = | మంచి స్వభావము కలవాడును అగు |
| వేంకటేశాయ | = | వేంకటేశుని కొరకు |
| మంగళమ్ | = | శుభము కలుగుగాక ! |

**పరస్మై బ్రహ్మణే పూర్ణకామాయ పరమాత్మనే**
**ప్రయుంజే పరతత్త్వాయ వేంకటేశాయ మంగళమ్. 07**

**ప్రతి పదార్థము :**

| | | |
|---|---|---|
| పరస్మై బ్రహ్మణే | = | పరబ్రహ్మ స్వరూపుడును (నిర్గుణమూ, నిరుపాధికమైన బ్రహ్మం) |
| పూర్ణకామాయ | = | నిండిన కోరికలు కలవాడును (అనగా కోరికలు లేనివాడును) |
| పరమాత్మనే | = | పరమాత్మ అయినవాడును |
| పరతత్త్వాయ | = | పరతత్త్వ రూపి అయినవానికి |
| వేంకటేశాయ | = | వేంకటేశ్వర స్వామికి |
| మంగళమ్ | = | మంగళాశాసనమును |
| ప్రయుంజే | = | చేయుచున్నాను. |

**విశేషాలు :** పరబ్రహ్మ పదాన్ని పలువురు పలు విధాలుగా నిర్వచించారు. అందులో కొన్ని: 1. స్వయం ప్రకాశం కలిగి, జ్ఞానరూపమైన ఆత్మ. 2. కార్యకారణాలకంటే భిన్నమై, క్షరాక్షరాల కంటే కూడావేరుయై, స్వాభావికంగా నిత్యమై, శుద్ధమై, బుద్ధమై, ముక్తమైన పదార్థం. 3. అవిద్య వల్ల ఆత్మగా తలచిన దేహం మొదలు బుద్ధివరకు

3/30/25, 7:18 PM PDF.js viewer



ఉన్న తత్త్వాలకు అతీతమైనది. సర్వోత్కృష్టమైనదీ, ఉపద్రష్టృత్వాది విశేషణ విశిష్టమై ప్రకాశించే ఆత్మ. 4.ఆత్మగా కల్పితాలైన పంచ కోశాలకు, విరాట్, హిరణ్య గర్భ, అవ్యాకృత తత్త్వాలకు అతీతమై, బ్రహ్మకు పూర్వం నుంచి ఉన్న పదార్థం. 5.సమస్త భూతాలలోని ప్రత్యక్చేతనం. 6.మాయాశక్తికి ఆశ్రయం. 7.సర్వానికి అధిష్ఠానమైనది. 8.పర దేవత. 9.దైవం / పరబ్రహ్మం.

**ఆకాల తత్త్వ మశ్రాంత మాత్మనా మనుపశ్యతామ్**
**అతృప్త్యమృత రూపాయ వేంకటేశాయ మంగళమ్. 08**

**ప్రతి పదార్థము :**

| | |
|---|---|
| ఆకాల తత్త్వమ్ | = కాలతత్త్వము ఉండు వరకు |
| అశ్రాంతమ్ | = ఎప్పుడూ |
| అనుపశ్యతామ్ | = దర్శించుచున్న |
| ఆత్మనామ్ | = ప్రాణులకు |
| అతృప్త్యమృత రూపాయ | = తనివితీరని అమృతస్వరూపుడగు |
| వేంకటేశాయ | = శ్రీ వేంకటేశ్వరునకు |
| మంగళమ్ | = మంగళము |

**ప్రాయః స్వ చరణౌ పుంసాం శరణ్యత్వేన పాణినా**
**కృపయా దిశతే శ్రీమద్వేంకటేశాయ మంగళమ్. 09**

**ప్రతి పదార్థము :**

| | |
|---|---|
| ప్రాయః | = తరచుగా |
| పుంసాం | = మానవులందరికి; |
| శరణ్యత్వేన | = శరణముగా |
| పాణినా | = తన వరదహస్తముతో |



https://shanthavasanthatrust.org/books/sri-venkateshwara-suprabhatham/ 78/82

స్వ చరణౌ = తన పాదముల జంటను
కృపయా = దయతో
దిశతే = చూపుచున్న
శ్రీ మత్ వేంకటేశాయ = శ్రీ వేంకటేశ్వరునకు మంగళము

**దయామృత తరంగిణ్యా స్తరంగై రివ శీతలైః**
**అపాంగై స్సించతే విశ్వం వేంకటేశాయ మంగళమ్. 10**

**ప్రతి పదార్థము :**

దయ+అమృత తరంగిణ్యాః = దయ అను అమృత ప్రవాహము లోని
తరంగైః +ఇవ = అలల వలె
శీతలైః = చల్లనైన
అపాంగైః = కటాక్షముల చేత
విశ్వం = ప్రపంచమును
సించతే = తడుపుచున్న
వేంకటేశాయ = శ్రీ వేంకటేశ్వరునకు
మంగళమ్ = మంగళమగు గాక

**స్రగ్భూషాంబర హేతీనాం సుషమావహ మూర్తయే**
**సర్వార్తి శమనాయాస్తు వేంకటేశాయ మంగళమ్. 11**

**ప్రతి పదార్థము :**

స్రక్ = పూలమాలలవలనను
భూష = స్వర్ణ రత్నాభరణములు
అంబర = పీతాంబరములు
హేతీనాం = చక్రము మొదలయిన 16 ఆయుధములను ధరించుటవలన

3/30/25, 7:18 PM PDF.js viewer



సుషమావహ మూర్తయే = పరమశోభను కలిగించు అందమైన విగ్రహము కలిగిన వాడును,
సర్వ+ఆర్తి శమనాయాః+తు= సమస్త బాధలను పోగొట్టువాడును అగు
వేంకటేశాయ = శ్రీ వేంకటేశ్వరునకు
మంగళమ్ = మంగళమగు గాక.

**శ్రీ వైకుంఠ విరక్తాయ స్వామిపుష్కరిణీ తటే**
**రమయా రమమాణాయ వేంకటేశాయ మంగళమ్. 12**

**ప్రతి పదార్థము :**

శ్రీ వైకుంఠ విరక్తాయ = శ్రీ వైకుంఠ పురముపై విరక్తిని పొంది;
స్వామిపుష్కరిణీ తటే = స్వామి పుష్కరిణీ తీరమున;
రమయా = లక్ష్మీదేవితో;
రమమాణాయ = విలాసముగా క్రీడించు;
వేంకటేశాయ = శ్రీ వేంకటేశునకు;
మంగళమ్ = మంగళమగు గాక.

**శ్రీమత్సుందరజామాతృ మునిమానస వాసినే**
**సర్వలోక నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్. 13**

**ప్రతి పదార్థము :**

శ్రీమత్సుందరజామాతృ
మునిమానస వాసినే = శ్రీ రమ్యజామాతృ ముని మనస్సున నివసించువాడును,
సర్వలోక నివాసాయ = సమస్త లోకములందును నివసించువాడును అగు



https://shanthavasanthatrust.org/books/sri-venkateshwara-suprabhatham/ 80/82

| | |
|---|---|
| శ్రీనివాసాయ | = శ్రీ శ్రీ వేంకటేశ్వర స్వామికి |
| మంగళమ్ | = మంగళమగుగాక ! |

**మంగళా శాసన పరై ర్మదాచార్య పురోగమైః**
**సర్వైశ్చ పూర్వై రాచార్యై స్సత్కృతాయాస్తు మంగళమ్. 14**

**ప్రతి పదార్థము :**

| | |
|---|---|
| మంగళా శాసన పరైః | = మంగళ పాఠము చదువుటలో ఆసక్తి కలిగిన; |
| మదాచార్య పురోగమైః | = నా ఆచార్యులకు పూర్వులైన; |
| పూర్వైః | = పూర్వులైన, ముందు గతించిన; |
| ఆచార్యైః | = ఆచార్యులచేత; |
| సర్వైశ్చ | = అందరిచేత; |
| సత్కృతాయ | = సత్కరింపబడిన ( శ్రీ వేంకటేశ్వరస్వామికి); |
| మంగళం | = మంగళము; |
| అస్తు | = అగుగాక ! |





శాంతా-వసంతా ట్రస్టు స్వరం చేయించిన 'శ్రీ వేంకటేశ్వర సుప్రభాతం' ఆడియో మీ మొబైల్‌లో వినాలంటే ఈ QR Code స్కాన్ చేసి వినగలరు.





'శ్రీ వేంకటేశ్వర సుప్రభాతం' యూట్యూబ్ వీడియో ఈ QR Code స్కాన్ చేసి చూసి ఆస్వాదించగలరు.



Installand Open the Scan App
for Android Phones and
QR Scan App in Apple Phones



Scan this QR Code either to play music
or to download it on your device.

OR

Also you can watch in youtube.
Our channel name is :
Shanthavasanthatrust



